Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 18 • 4-5-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## కొమ్మికి పచ్చ జెండా

ఆత్మకూరు మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు తమ పార్టీలో చేరడానికి పచ్చ జెండా వూపాడు వైఎస్‌జగన్. రేపు 27తేది ఆత్మకూరు నియోజకవర్గంలో జరిగే ప్రచార సభలో కొమ్మి భుజం మీద వైఎస్ఆర్ కాంగ్రెస్ కండువా కప్పబోతున్నారు. కొమ్మి చేరికపై జిల్లా నేతలు చాలా అభ్యంతరాలే చెప్పారు. వద్దంటే వద్దని అడ్డం పడ్డారు. కానీ తన పార్టీ కేవలం రెడ్లకు పరిమితం అన్న చెడ్డ పేరు తొలగాలంటే ఇతర కులాలలోని ప్రముఖులను దగ్గర తీయక తప్పదనే ఆలోచనలో వున్న జగన్ ఆ అభ్యంతరాలన్నిటినీ పక్కకు నెట్టేసి, ఈ నిర్ణయం తీసుకొన్నట్లు తెలుస్తున్నది. తెలుగుదేశం నుంచి మరొక ప్రముఖుడు టి.రమేష్‌రెడ్డికి కూడా వల విసిరి వున్నారు. అది జెల్ల చేప, జారి పోతుందే తప్ప వలకు అంత సులభంగా చిక్కకపోవచ్చు.

# మృతసంజీవని మూలిక కావాలి!

రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి పునరుజ్జీవం కల్గించాలంటే అలనాడు లక్ష్మణుడ్ని బ్రతికించిన మృతసంజీవని మూలిక వంటిదేదైనా కావాలని నివేదించాడట – వాయిలార్ రవి. అయితే ఆంజనేయుడి వలె గాలిలో ఎగిరి కొండలను పెకలించుక వచ్చే శక్తి నాకైతే లేదు, నన్ను వదిలెయ్యండి బాబో అని కూడా వేడుకొన్నాడట. కాంగ్రెస్ సంగతులు తెలుసుకోవడానికి సోనియమ్మ దూతగా హైదరాబాదుకు వచ్చిన ఎఐసిసి పరిశీలకుడు వాయిలార్ పరిశీలన సారాంశం ఇదీ! రాజధానిలో రెండు రోజులు గడిపినా ఆయనకు దిమ్మ తిరిగిపోయింది. రెండేళ్ల క్రితం వరకు వెలుగులు చిమ్ముతుండిన కాంగ్రెస్ పార్టీ ఇంత స్వల్ప కాలంలో మృత ప్రాయంగా మారిపోవడం ఎందువల్లనో ఆయనకు అర్థమే కాలేదు. రోగం ముదిరిపోయేంత వరకు వినోదం చూసి, ఇప్పుడు బ్రతికించమంటే ఎట్లా అని ఆవేదన చెందాడు. అదే విషయం ఢిల్లీకి చేరవేశాడు. ముఖ్యమంత్రి మీద పార్టీలో, ప్రభుత్వంలో, మంత్రులలో, ఎమ్మెల్యేలలో తీవ్ర అసంతృప్తి వుందని పిసిసి అధ్యక్షుడి మీద కనీసపాటి నమ్మకం ఎవరిలోనూ లేదని; విద్యుత్ చార్జీల పెంపు, ఆస్తి పన్ను పెంపు వంటి చర్యల వల్ల ప్రజలలో కాంగ్రెస్ విముఖత బలపడి పోయిందని; జగన్ దూకుడును అడ్డుకోవడంలో కానీ, తెలంగాణ ఉద్యమాన్ని ఎదుర్కోవడంలో కానీ సరైన, సమర్థవంతమైన నాయకత్వం లోపించడంతో పార్టీ జీర్ణావస్థకు చేరుకొన్నదని; ఈ నేపథ్యంలో 2014లో పార్టీని గట్టెక్కించాలంటే మృత సంజీవని మూలిక వెతికి తేవడం తప్ప గత్యంతరం లేదని విన్నవించాడు వాయిలార్ రవి. ఇప్పటికైనా జగన్, తెలంగాణ అంశాలలో ఒక స్థిర నిర్ణయానికి రావాలని నివేదించాడు.

దీని ఫలితమే – 18 స్థానాల ఉప ఎన్నికలకు అభ్యర్థుల జాబితా తెచ్చిన పిసిసి అధ్యక్షుడు, ముఖ్యమంత్రుల మీద సోనియమ్మ విరుచుకపడడం. పార్టీకి దూరమై పోయిన వర్గాలను, కులాలను మళ్లీ అక్కున చేర్చుకొనే మార్గమేమిటో అధ్యయనం చేసి, స్పష్టమైన కార్యాచరణ ప్రణాళికతో తన వద్దకు తిరిగి రావాలని ఆదేశించారు సోనియాగాంధీ. అయితే ఆ మార్గం వీరిద్దరికీ ఏమి తెలుసు?

### చిరుకు పెను సవాలు

రాష్ట్రంలో ప్రజాకర్షణ కల్గిన ఏకైక కాంగ్రెస్ నేతను నేనే అని ఢిల్లీలో గప్పాలు కొట్టుకొని, రాజ్యసభ సభ్యత్వం తెచ్చుకొన్న సినీ నటుడు చిరంజీవికి తిరుపతి శాసనసభ ఉప ఎన్నిక ప్రాణ సంకటంగా మారింది. తన రాజీనామాతో ఖాళీ అయిన స్థానంలో మళ్లీ కాంగ్రెస్‌ను గెలిపించే బాధ్యత చిరంజీవి మీద మోపింది సోనియాగాంధీ. ఆమె దగ్గర పరువు నిలవాలంటే అభ్యర్థిని గెలిపించాలి. కానీ తలక్రిందులు తపస్సు చేసినా ఆ కల నెరవేరేట్లు లేదు. అక్కడ ఓడిపోతే ఢిల్లీలో తలెత్తుకొని తిరగడం కష్టం. సినీ జీవి కాబట్టి, అసలు తలే లేకుండా కూడా బ్రతికేసే విద్యలు వచ్చే వుంటాయి. కాబట్టి ఇబ్బంది లేదు.



# చట్టాలేమౌతున్నాయి?

సూరి హంతకుడు భాను కిరణ్ నేరచరిత్ర వింటుంటే ఒళ్లు జలదరిస్తున్నది. ఒక సాధారణ యువకుడు నేర ప్రవృత్తిని అలవరచుకొంటే, దాన్ని వృత్తిగా మలచుకొంటే ఎంతటి దారుణాలు చేయగలడో విపులంగా చెప్తున్నదీ ఉదంతం.

రాయలసీమ ముఠా నేత మద్దెలచెరువు సూర్యనారాయణరెడ్డి అనుచరుడిగా నేర ప్రపంచంలోకి అడుగు పెట్టాడు భాను. పరిటాల రవి హత్యకు జరిగిన ప్రతి ప్రయత్నంలో అతడికి ఏదో ఒక సంబంధం వుందని ప్రతీతి. ఆ ప్రక్రియ అతడికి నేరాలలో గట్టి శిక్షణే ఇచ్చింది. జూబ్లీహిల్స్ కారు బాంబు కేసు, ఆ తర్వాత పరిటాల రవి హత్య కేసులలో జైలుకు వెళ్లిన సూరి, బయటి ప్రపంచంలో తన అకృత్యాలను నడిపించడానికి భానును వినియోగించాడు. ఆ అవకాశాన్ని వినియోగించుకొన్న భాను రాష్ట్రం మొత్తం మీద తన విశ్వరూపం ప్రదర్శించాడు. భూమి తగాదాలు, సినిమా నిర్మాతలకు అప్పులిచ్చే ఫైనాన్సియర్ల పేచీలు, వ్యాపార భాగస్వాముల మధ్య ఏర్పడే వివాదాలు వంటి వాటన్నిటిలో వేలు పెట్టాడు. మంత్రులు, ఎమ్మెల్యేలతో స్నేహం చేశాడు. పోలీసులకు, రెవిన్యూ అధికారులకు లంచాలు మరిపాడు. సినీ తారలను పక్కలో పండబెట్టడం ద్వారా ఆ అధికారులపై వశీకరణ మంత్రం ప్రయోగించేవాడు. దానితో అతడి నేర క్రీడకు అందరి సహకారం అందింది. ఏదైనా కేసులో క్లిష్ట పరిస్థితి ఎదురైతే, పోలీసు వేటను తప్పించుకోవడానికి మంత్రుల బంగ్లాలలో నెలల తరబడి మకాం పెట్టడమే కాదు, అక్కడి నుంచే తన దౌర్జన్యాలను జరిపించేవాడంటే, భాను ఏ స్థాయికి ఎదిగాడో అర్థం చేసుకోవచ్చు. తుపాకులు అతడి ఆట వస్తువులు. వాటిని చూపించి, తలకు ఆనించి బెదిరించేవాడు. అవసరమైతే నిలువునా ప్రాణాలు తీసేవాడు. ఈ పశుత్వానికి అతడికి ఉన్నత స్థానం నుంచి పూర్తి సహకారం లభించింది. వైఎస్.జగన్ ప్రధాన అనుచరుడు, ఎప్పుడూ ఆయన వెన్నంటే వుండే మంగలి కృష్ణ వంటివారు భానుకు అన్ని విధాల తోడ్పాటు అందించారు. మంగలి కృష్ణ తోడ్పాటు అంటే సాక్షాత్తు వైఎస్.జగన్ చేయూత అని అర్థం. మరొకప్రక్క హోంమంత్రి సబితా ఇంద్రారెడ్డి కుమారుడితో భానుకు ఈ నేరాలలో భాగం వుందని వదంతి. అంత ఉన్నతస్థాయిలో మద్దతు లభిస్తే ఏ నేరస్థుడైనా ఎట్లా రెచ్చిపోతాడో వివరించి చెప్పనవసరం లేదు కదా? ఈ ఆరేడేళ్లలో భాను అక్రమ ఆర్జన 800 కోట్ల రూపాయల పైమాటే అని పోలీసులు వురామరిగ్గా అంచనా వేస్తున్నారు. అతడి బ్యాంకు ఖాతాలలోనే 25 కోట్ల రూపాయల నగదు నిల్వ వున్నదట. హైదరాబాదు, విజయవాడ నగరాలతో పాటు, నెల్లూరు, కడప, ఉభయ గోదావరి జిల్లాలలో వందలాది ఎకరాల భూమి అతడి పేరు మీద, అతడి బినామీల పేరు మీద రిజిస్టర్ అయి వుంది. ఎన్నో వ్యాపారాలలో బలవంతపు భాగస్వామ్యం వుంది.

ఒక నేరస్తుడు రాష్ట్రంలో ఇంత విచ్చలవిడిగా దౌర్జన్యాలకు, దుర్మార్గాలకు పాల్పడుతుంటే పోలీసు యంత్రాంగం ఏమి చేస్తున్నట్లు? నేరస్తుల నియంత్రణకు ప్రభుత్వం చేసిన చట్టాలన్నీ ఏమైనట్లు? చట్టాలను అమలు చేయవలసిన బాధ్యత కల్గిన వర్గాలు నేర ప్రపంచంతో మమేకం కావడం వల్లనే నేరస్తులు ఇట్లా రెచ్చి పోతున్నారన్నది నిజం. పోలీసు, రెవిన్యూ విభాగాల అధికారులు ఒక ప్రక్క, రాజకీయవాదులు, వ్యాపారులు మరొకప్రక్క నేరస్తులతో చేతులు కలిపి నడవడం వల్లనే భాను వంటి నేరగాళ్ల ఆటలు ఇష్టారాజ్యంగా నడిచి పోతున్నాయి. ఇప్పుడు భానును అరెస్టు చేయడం వెనుక కూడా పోలీసు కుట్ర వుందని వినికిడి. సిఐడి విభాగంలో వున్న ఒక సీనియర్ అధికారి భాను నుంచి పెద్ద మొత్తంలో బేరం కుదుర్చుకొని ఈ అరెస్టు ప్రహసనం నడిపిస్తున్నాడని తెలుస్తున్నది. తాను ఆ పదవిలో వున్నప్పుడే లొంగిపోతే, వంటి మీద చెయ్యి వేయకుండా, ప్రాణానికి హాని కలగకుండా, తెర వెనుక వున్న వారి భాగోతాలు బయటపడకుండా కాపాడుతాననే హామీతో భానును అదుపులోకి తీసుకొన్నారట. హోంమంత్రి, వైఎస్.జగన్, మరికొందరు మంత్రులు, ఎందరో ఎమ్మెల్యేలు, ఉన్నతస్థాయి పోలీసు అధికారులు, సినిమా తారలు, నిర్మాతలు వంటి పలుకుబడి కల్గిన వ్యక్తులు భానుతో కలిసి పని చేశారు కాబట్టి, అతడు నోరు విప్పితే పెను సంచలనమే పుట్టుకొస్తుంది. ఆ ప్రమాదం ఏర్పడకుండా భానుతోపాటు వారందరినీ కాపాడే బాధ్యతను సిఐడి విభాగం నేర్పుగా నిర్వర్తిస్తున్నదని చెప్తున్నారు. రాజకీయం, అధికారం, నేరం పడుగు పేకల వలే కలిసిపోయి సమాజాన్ని నాశనం చేయడం దారుణం. ఈ దురాగతాల నుంచి ప్రజలను రక్షించే వాడు ఎప్పుడొస్తాడో, అసలొస్తాడో రాడో?

జమీన్‌రైతు

## జనవాణి

### ప్రభుత్వ పథకాల వైఫల్యం!

ఎన్నికలలో అధికారం కైవసం చేసుకోవడం కోసం ప్రభుత్వం అక్కరలేకపోయినా అనేక ప్రజాకర్షక పథకాలను ప్రవేశపెడుతోంది. వీటిపై సరైన పర్యవేక్షణ విధానం కొరవడడం వల్ల నిధులలో సింహభాగం అక్రమార్కుల జేబుల్లోకి వెళ్లిపోతున్నాయి. సంక్షేమ పథకాల ఫలం లబ్దిదారులకు చేరకపోవడం వలన వారి పరిస్థితి ఎక్కడ వేసిన గొంగళి అక్కడేనన్న చందాన వుంది. కనుక ప్రభుత్వం పథకాల నిర్వహణ లోపరహితంగా వుండేలా పర్యవేక్షణ విధానాన్ని రూపొందించాలి. కేటాయించిన నిధులు ఎంతవరకు ఉపయోగపడుతున్నాయనే దానిపై ప్రతి ఆరునెలలకు ఒకసారి "కాగ్" చేత ఆడిట్లు చేయించడం, స్వతంత్ర సంస్థల చేత అధ్యయనం చేయించి లోటుపాట్లను సరిదిద్దుకోవడం చేయాలి.

పి.అరుణకుమారి నెల్లూరు

### భవిష్యనిధి బకాయిలు చెల్లించండి!

నేను రిటైర్డ్ జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల ఉపాధ్యాయుడను. లోగడ ఉన్నత పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయులంతా జడ్పీ యాజమాన్యంలో పని చేస్తూ వారి నిధుల నుండే జీతభత్యాలు తీసుకొనే వాళ్లం. ఆ సమయంలో 'జడ్పీ భవిష్యనిధిని' ఏర్పాటు చేసుకొన్నాం. 2005లో జడ్పీ ఉపాధ్యాయులంతా విద్యాశాఖలో విలీనమై '010' పద్దు క్రింద నేరుగా ట్రెజరీల ద్వారా జీతభత్యాలు తీసుకొనే సౌలభ్యం ఏర్పడింది. కాని జడ్పీ పి.ఎఫ్ అకౌంట్స్ మాత్రం జిల్లా పరిషత్ యాజమాన్యం క్రిందనే వున్నాయి. నేను గత ఏడాది మార్చి 31 తేదీన పదవీ విరమణ చేసినాను. నాకు రావాల్సిన భవిష్యనిధి బకాయిల కొరకు 2012 జనవరి చివర దరఖాస్తు చేశాను. కానీ ఇంతవరకు నా భవిష్యనిధి మొత్తం నాకు అందలేదు. అదేమని జడ్పీ యాజమాన్యాన్ని అడిగితే ట్రెజరీ వారు గ్రాంటు రిలీజ్ చేయలేదని నిర్లక్ష్యంగా సమాధానం చెబుతున్నారు. ఈ వ్యవహారాన్ని ఉన్నతాధికారులు పరిశీలించి పరిష్కరించాలి.

కలికి చంద్రశేఖర్‌రెడ్డి నెల్లూరు

### నష్టపోయిన కాంగ్రెస్‌పార్టీ

రాష్ట్రంలో కాంగ్రెస్‌పార్టీ పీకల్లోతు కష్టాల్లో చిక్కుకొని వుంది. పార్టీకి కాయకల్ప చికిత్స అవసరమని ఇటీవల కేంద్రమంత్రి వాయిలార్ రవి రాష్ట్రంలో పర్యటించి వెళ్లారు. రెండున్నరేళ్ల క్రితం జగన్‌ను సిఎం చేయాలని 154 మంది ఎమ్మెల్యేలు ఆయనకు మద్దతుగా సంతకాలు చేసినప్పుడే కాయకల్ప చికిత్స మొదలు పెట్టాల్సింది. రోశయ్యను సిఎం పదవి నుంచి తప్పించి ప్రజాబలం లేని కిరణ్‌కుమార్‌రెడ్డిని ముఖ్యమంత్రి చేయడం పార్టీ అధిష్టానం చేసిన మరో తప్పు. అన్నీ గమనిస్తున్నాం, సమయం వచ్చినప్పుడు వేటు తప్పదంటూ ఏమీ చేయలేకపోయినా పార్టీ అధిష్టానమంటే పార్టీలో ఎవరికీ భయం లేకుండా

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

8-5-1942
పేజీలు : 8 వెల: అణా

### నెల్లూరు గలాటాలు

జెండావీధిలో పడమర కోటమిట్టవైపు 4వ తేది రాత్రి రెండు మహమ్మదీయుల పాకలు తగులబడినవి. యద్లవారి వీధిలో కొయ్య పనిచేసే ఒక ముస్లిం యింటిని 5, 6 రోజుల క్రిందట తగులబెట్టగా అప్పుడే ఆర్పారనీ, ఆ క్రోధంతో వకీలు బి.రామస్వామయ్య గారి టైపిస్టు రామస్వామిని రౌడీలు 4వ తేది కొట్టారనీ, ఈ సందర్భంలో నల్గురు హిందువులను అరెస్ట్ చేశారు.

జయభారతి హోటలుకు 6వ తేది రాత్రి ఎవరో రౌడీలు వచ్చి కుర్మాలేదంటే తగువుబెట్టుకొనిపోయి ప్రొద్దుపోయి కొందరు వచ్చి హోటలు సంబంధీకుల్లో ఒకర్ని పొడిచి, ఇద్దర్ని కొట్టి పాయ్యారు. బ్లాకౌటు కటిక చీకటి ఎవరిని పోలుస్తుంది? యిది మత సంబంధంగాదులెండి?

### కళ్లు కాళ్లు ఉన్నవా?

నెల్లూరు ట్రంకురోడ్డులో పోతూంటే రోడ్డు మీద పోవద్దు. ప్రక్కన ప్రత్యేకంగా ఉండే ఫుట్‌పాత్ మీద నడువు అని దబాయిస్తాడు పోలీసు ఆయన. ప్లాట్‌ఫారమ్ మీద కాలు పెట్టేందుకు సందే ఉండదు. ప్లాట్‌ఫారం సన్నగా, అంగళ్ల సామాగ్రి అంతా చిక్కగా ఉన్నది. మరి నన్ను ఎట్లా పొమ్మంటాడో ట్రంకురోడ్డు అధిదేవత ఈ పోలీసాయన.

### చల్లాయపాళెం

"పంతుల వారికి, ఆ యానాది వాణ్ణి చచ్చేట్టు పండగా లేవంగా కొట్టే అధికారం గూడా సర్కారు వారు యిచ్చారా? అని గత 18వ తేది పెనుబల్లి రోడ్డు 1–మైల్లో ఎవరో ఇద్దరు వితర్కించుకొంటుండినారే. ఎక్కడిదీ రహస్య మర్దనం?

## 50 ఏళ్ల క్రితం ఈవారం

4-5-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### బాలిరెడ్డిపాళెం అధ్యక్షునిగా శ్రీనివాసులురెడ్డి!

నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి జిల్లా పరిషత్తు అధ్యక్షులుగా ఎన్నుకోబడినారు కాబట్టి బాలిరెడ్డిపాళెం పంచాయితీ సమితి అధ్యక్షత దానంతట అదే రద్దవుతుంది. ఈ స్థానానికి కొత్తగా ఎన్నిక జరుగవలసి ఉంది. ఎన్నిక తేదిని కలెక్టరు నిర్ణయిస్తారు. బహుశా మే మూడవ వారంలో ఉండవచ్చు.

సమితి ఏర్పడినపుడు ఈ సమితి సభ్యుల సంఖ్య 48. కానీ ఇటీవల ఎల్లసిరి నుండి చీలి అరవపాళెం ప్రత్యేక పంచాయితీగా ఏర్పడింది కాబట్టి సభ్యుల సంఖ్య 48 నుండి 49కి పెరిగింది. ఇందులో షుమారు 40 మంది నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి వర్గానికి చెంది ఉంటారు. ఇందులో అధ్యక్షుడు కావాలనే తలంపు చాలా మందికి ఉండినదిగానీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి ప్రస్తావన వచ్చిన తర్వాత ఇంకెవ్వరూ రంగంలో ఉండరనే భావించవచ్చు. శ్రీనివాసులురెడ్డి ఊరూరు తిరిగి ప్రతి అధ్యక్షుని కలుసుకొని తన అభ్యర్థిత్వానికి వారి సహాయాన్ని అర్థిస్తున్నారు. ఈ సారి స్వతంత్ర పార్టీ వారి నామకార్థపు పోటీ గూడా లేకుండా పోవచ్చు. అంతేగాక గత పర్యాయం చంద్రశేఖర్‌రెడ్డితో పోటీచేసిన ఈశ్వరవాక పంచాయితీ అధ్యక్షుడు మునుకూరు వెంకట రామిరెడ్డి గారే శ్రీనివాసులరెడ్డి గారి పేరును ప్రతిపాదించినా ఆశ్చర్యం ఉండదు. వాకాడు అధ్యక్షుడు గూడా పోటీ పెట్టము అని చెప్పినారంటున్నారు.

ఈ పరిస్థితుల్లో శ్రీనివాసులరెడ్డి ఎన్నిక ఏకగ్రీవంగానే ఉంటుంది.

–జ.వి

# నెల్లూరు ముచ్చట్లు

## తెలుగుదేశం ముఖ్యులకు క్యాష్!

28వ తేదీ తిరుపతి పర్యటనకు వచ్చిన తెలుగుదేశం పార్టీ సర్వాధినేత చంద్రబాబునాయుడు మొన్నటి కోవూరు ఉపఎన్నికల్లో బాగా పనిచేసిన పార్టీ నాయకులతోపాటు నెల్లూరు పార్లమెంటు స్థానం పరిధిలోకి వచ్చే నియోజకవర్గాల తాలూకు ముఖ్య నేతలకు ముందుగానే డబ్బు సంచులు ఇచ్చినట్లు విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింది. జిల్లాలో పోలీసు చెక్‌పోస్టులు ఏర్పాటు చేస్తుం డినా రాత్రిపూట డబ్బు జాతీయ రహ దారి మీదుగానే నెల్లూరు వచ్చి చేరింది.

## కరెంట్ వాడకం తగ్గిందట!

పెరిగిన ఛార్జీల దెబ్బ కరెంట్ బిల్లులు ఏ మోతాదులో వస్తాయోనని భయపడుతున్న ప్రజలు ఇళ్లలో విద్యుత్ వినియోగం బాగా తగ్గించుకొన్నారు. దీంతో జిల్లాకు కేటాయించిన కోటా విద్యుత్‌ను ఈ ఎండల్లో సైతం ప్రజలు వాడుకోక పోవడం వల్ల ఈ వారం నగ రంలో విద్యుత్ కోత అనధికారికంగా ఎత్తే శారు. జనం విద్యుత్‌ను మళ్లీ బాగా వాడితే కోతలుంటాయి. బాగుందీ య్వవారం!

## పార్లమెంటు స్థానం నుంచి సిపిఎం పోటీ!

నెల్లూరు పార్లమెంటు స్థానం నుంచి బరిలోకి దిగుతున్నట్లు సిపిఎం పార్టీ ప్రకటించింది. ఆ పార్టీ జిల్లా కార్య దర్శి చంద్ర రాజగోపాల్ అభ్యర్థిగా పోటీలో ఉంటారు. రాజగోపాల్ మర్రి పాడు మండలం పల్లవోలు వాసి. 1973–79 సంవత్సరాల మధ్య సిపిఎం విద్యార్థి విభాగం ఎస్ఎఫ్ఐలో పనిచేశారు. 1977 నుంచి 85 వరకు సిపిఎం పార్టీ ఆత్మకూరు డివిజన్ కార్యదర్శిగా వ్యవ హరించిన ఆయన 1985 నుంచి జిల్లా రైతు సంఘం నాయకునిగా ఎదిగారు. 1999 అసెంబ్లీ ఎన్నికల్లో ఆత్మకూరు స్థానం నుంచి సిపిఎం అభ్యర్థిగా పోటీ చేశారు. ఇటీవలే పార్టీ జిల్లా కార్యదర్శిగా ప్రమోషన్ పొందిన ఆయనకు పార్టీ తర పున లోక్‌సభకు పోటీచేసే అవకాశం కూడా వచ్చింది. గతంలో నెల్లూరు లోక్ సభ స్థానానికి సిపిఎం తరపున బరిలో దిగిన టి.పి.భానురాజు కొన్నిసార్లు డిపా జిట్లు కోల్పోయినా రెండుసార్లు గణనీ యంగా ఓట్లు తెచ్చుకొన్నారు. చంద్ర రాజగోపాల్ పరిస్థితి ఏమిటో అప్పుడే చెప్పలేం.

## రాజమోహన్‌రెడ్డి చిటపట!

నెల్లూరు పార్లమెంటు నియోజక వర్గం నుంచి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీచేస్తున్న తిక్కవరపు సుబ్బరామిరెడ్డిపై వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి మేక పాటి రాజమోహన్‌రెడ్డి చిటపటలా డారు. సుబ్బరామిరెడ్డి చెప్పినట్లు నాకు ఆయన బంధువే. మంచి స్నేహితుడు కూడా. కానీ ఆయన ఏదో చిదంబర రహస్యంతోనే నాకు ప్రత్యర్థిగా కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా పోటీచేస్తున్నట్లుంది. ఆయన ఆ రహస్యమేదో నాకు చెబితే బాగుంటుందని ఉదయగిరి తరహా మాటల్లో అక్కసు ప్రదర్శించారు. దీనికి కారణం ఆయనే చెప్పాలి మరి?

## విజయచందర్ విసుర్లు!

కరుణామయుడు ఫేం విజయ చందర్ వైఎస్ఆర్ కాంగ్రెస్ అధికార ప్రతినిధిగా నెల్లూరులో జరిగే కార్యక్ర మాల్లో విరివిగా పాల్గొంటున్నాడు. విజయచందర్ ముఖం, మాటలు కొన్ని వర్గాలను ఆకర్షిస్తాయి కాబట్టి మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఆయన ఎక్కడకు వెళ్లినా అక్కడకు విజయచందర్‌ను తీసు కెళ్తుంటాడు. రూరల్ ఎమ్మెల్యే వివేకా నందరెడ్డి సినీ యాక్టర్లను మరిపిస్తూ వేస్తున్న వేషాలు విజయచందర్‌ను విస్తు గొల్పినట్లున్నాయి. దీంతో వివేకాపై కొన్ని విసుర్లు వేశారు. వివేకానందరెడ్డి గుర్రం... గాడిదలపైనే కాదు... దేనిపైనైనా స్వారీ చేయగలడు. టీ కప్పులు కడగడం, కార్లు సర్వీసు చేయడం ఏ విధంగా ప్రజాపథ మవుతుంది. మా తాత టంగుటూరు ప్రకాశపంతులు, స్వర్గీయ ఎన్టీరామా రావు, డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డిలే తెలుగుజాతి కీర్తిని నలుదిశలా వ్యాపింప జేసిన మహనీయులు. నెల్లూరులో మా తాత సహచరుడు ఏసి సుబ్బారెడ్డి మను మడు ఆనం వెంకటరమణారెడ్డితో కలసి పనిచేయడం ఆనందంగా ఉంది. మేక పాటి రాజమోహన్‌రెడ్డి మాజీ ఎమ్మీ కాదు, రేపటితోపాటు భవిష్యత్తులో జరిగే అన్ని ఎన్నికల్లో గెలిచి జీవితకాలం ఎమ్పీగా ఉంటారని చెప్పుకొచ్చారు.

## అకాల వర్షం

29వ తేదీ సాయంకాలం నెల్లూరు నగరం మినహా మిగతా ప్రాంతాల్లో కురి సిన అకాల వర్షం రైతులకు ఎంతో ఖేదాన్ని మిగిల్చింది. కావలి డివిజన్‌లోని జలదంకి, కలిగిరి, కొండాపురం, వరి కుంటపాడు, వింజమూరు, ఉదయగిరి, దుత్తలూరుల్లో వర్షం దంచి కొట్టింది. గూడూరు డివిజన్‌లోని చిల్లకూరు, కోటల్లో వీచిన పెనుగాలులకు మామిడి పిందెలు రాలిపోగా, ఎండబెట్టిన మిర్చి పంట తడిచి ముద్దయ్యింది. కావలి, గూడూరు డివిజన్లలో వర్షం కురిసిన రోజు నెల్లూరులో ఎండ అదరగొట్టింది.

## సైలెంట్ ముక్కాల

సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డికి కుడిభుజం వంటివాడు, స్టోన్‌హౌస్‌పేట ఆర్యవైశ్యుల్లో కాస్త అభి మానులున్న ముక్కాల ద్వారకానాథ్ ఏప్రెల్ 30వ తేదీ నిశ్శబ్దంగా వైకాపాలో చేరిపోయారు. హైదరాబాద్‌లో జగన్మో హన్‌రెడ్డి సమక్షంలో జరిగిన ఈ కార్య క్రమంలో కాకాణి గోవర్ధన్‌రెడ్డి, డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్, మేకపాటి గౌతమ్‌రెడ్డిలు పాల్గొన్నారు.





నెల్లూరు కాంగ్రెస్ నేత సన్నపరెడ్డి వెంకట సుబ్బారెడ్డిని వైకాపాలోనికి ఆహ్వానిస్తున్న మేకపాటి రాజమోహన్‌రెడ్డి, నటుడు విజయచందర్, కాకాణి గోవర్ధన్‌రెడ్డి, ఆనం వెంకటరమణారెడ్డి.

## పొత్తులతో నష్టపోయాం!

గతంలో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలతో పొత్తుపెట్టుకొన్న కారణంగా చాలా నష్టపోయామని సిపిఎం సీని యర్ నేత జక్కా వెంకయ్య వ్యాఖ్యానిం చారు. సుందరయ్యకాలనీలో నూతనంగా నిర్మించిన పార్టీ కార్యాలయాన్ని ప్రారం భించారు. కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు అవినీతిమయం అయ్యాయని విమర్శించారు. మద్యం, డబ్బులతో ఎన్ని కలలో గెలుపొందేందుకు ఆ పార్టీలు ప్రయత్నిస్తున్నాయన్నారు. ప్రతి కార్యకర్త సుందరయ్య అడుగుజాడల్లో నడవాలని పిలుపునిచ్చారు.

## తాతాలో మధనం

తెలుగుదేశం పార్టీలో వెనుకబడిన తరగతుల నాయకుడు తాతా నాగేశ్వర రావుగౌడ్ పార్టీతో తెగతెంపులు చేసు కోవాలన్న నిర్ణయానికి వచ్చినట్లు వార్తలు వెలువడిన వెంటనే ఆయనకు చంద్ర బాబు నాయుడు ఫోన్‌లో సర్దిచెప్పారు. బాబు ఫోన్ తాతాలో మధనాన్ని తగ్గి స్తుందా?

## మాసంలో 30 వాహనాల చోరీ

నెల్లూరు నగరంలో వివిధ చోట్ల పార్క్‌చేసి ఉండిన ముప్పైకి పైగా స్కూ టర్లు, ఆటోలు, బైకులు ఏప్రెల్ నెలలో మాయమైపోయినట్లు పోలీసులకు ఫిర్యా దులు అందాయి. ఫిర్యాదు అందనివి ఇంకా ఎన్నో? క్రైం పోలీసులకు ఇది సిగ్గుగా తోచడం లేదా?

## వరప్రసాద్ స్థానంలో పరంధామయ్య!

ఇంటర్ బోర్డు ప్రాంతీయ పర్యవేక్ష ణాధికారిగా కందుకూరు ప్రభుత్వ కళా శాల ప్రిన్సిపాల్ వై.పరంధామయ్య బాధ్య తలు స్వీకరించారు. పరంధామయ్య జిల్లాకు పాతకాపే. ఆయన ఇక్కడ డివి ఇఓగా పనిచేశారు.

## వైకాపాలో సన్నపరెడ్డి సుబ్బారెడ్డి

నెల్లూరు వేదాయపాళెంలో మంచి బలమున్న నేత సన్నపురెడ్డి వెంకట సుబ్బారెడ్డి 28వ తేదీ వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో చేరారు. ఈ సందర్భంగా జ్యోతి నగర్‌లో అదిరిపోయే బహిరంగసభ ఏర్పాటు చేశారు. ఈ సభకు మాజీ ఎమ్మీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డి, సినీ నటుడు విజయచం దర్, ఆనం వెంకట రమణారెడ్డి, డాక్టర్ బాలచెన్నయ్య తదితర నేతలంతా పాల్గొ న్నారు. ఈ సందర్భంగా రాజమోహన్ రెడ్డి మాట్లాడుతూ వైకాపాలో వివిధ పార్టీల నుంచి చేరుతున్న వారిపై అధి కార పార్టీ నాయకుల అండదండలతో అధికారులు బెదిరింపులకు పాల్పడు తున్నారని ఈ పంథాను కొనసాగిస్తే తాము గట్టిగా ఎదుర్కొంటామన్నారు.

## పిల్లలకు పౌష్టికాహారం

ఏ.సి.సుబ్బారెడ్డి స్టేడియం వాకర్స్ అసోసియేషన్ నేతృత్వంలో మే 1వ తేదీ స్టేడియంలో ఆడుకోను వచ్చిన 500 మంది పిల్లలకు పాలు, కోడిగుడ్లు అంద జేశారు. 31వ తేదీ వరకు ఈ కార్యక్ర మాన్ని కొనసాగిస్తామని వాకర్స్ అసోసి యేషన్ అధ్యక్ష, కార్యదర్శులు ఎస్.రాఘ వేంద్రషెట్టి, ఎన్.బలరామయ్యనాయుడు చెప్పారు.

## ఏసి స్టేడియంకు కరెంట్ కట్

ఏసి స్టేడియంకు కరెంటు సర ఫరా నిలిపి వేశారు. దాదాపు ఆరు లక్షల రూపాయలకుపైగా విద్యుత్ బకాయిలు ఉండడంతో ఆ శాఖ అధికారులు ఈ నిర్ణయం తీసుకొన్నారు. ఇక్కడ వివిధ క్రీడావిభాగాలు ఉన్నాయి. కోట్ల రూపా యలు వెచ్చించి స్విమ్మింగ్ పూల్, ఇత రత్రా సదుపాయాలు కల్పించి ఉన్నారు. చాలాకాలంగా విద్యుత్ బకాయిలు చెల్లించమని కోరినా పట్టించుకోక పోవ డంతో విద్యుత్ సరఫరా తొలగించారు.

## వాసూరావుకు సన్మానం

విఖ్యాత సినీ సంగీత దర్శకుడు సాలూరు రాజేశ్వరరావు కుమారుడు

కొరవ 14వ పేజీలో

# మద్యం బినామీల డొంక కదిలిస్తున్న ఎసిబి!

## తెల్లరేషన్‌కార్డు కల్గిన బ్రాందీషాపుల వారికి నోటీసులు



నెల్లూరులోని ఎసిబి కార్యాలయం.

జిల్లాలో మద్యం మాఫియాపై ఎసిబి విచారణ జరుపుతోంది. తెల్లరేషన్‌కార్డుల పేరుతో ఎవరికివారు మద్యం షాపులు పొందారన్న దానిపై తనిఖీలు ముమ్మరం చేశారు. ఎసిబి డిఎస్పీ భాస్కర్‌రావు ఆధ్వర్యంలో ఆ శాఖ సిబ్బంది కూపీ లాగుతోంది. ఇందులో నిబంధనలకు విరుద్ధంగా సిండికేట్ల నిర్వహణతోపాటు అండదండలు అందించిన అధికారుల తీరు ఎసిబి విచారణలో ఒక్కొక్కటి బయట పడుతున్నాయి. జిల్లా వ్యాప్తంగా 348 మద్యం దుకాణాలున్నాయి. సగటున కోటి రూపాయలకు పైగా వెచ్చించి ఒక్కొక్క షాపును వేలంపాటల్లో దక్కించుకొన్న వ్యాపారులు తమ కార్యకలాపాలు సాగిస్తున్నారు. మామూళ్లతో నిబంధనలకు పాతర వేసి అధిక ధరలకు అమ్ముతూ అధిక ఆదాయం గడించారు. దీనిపై ఎసిబి అధికారులు దృష్టి సారించి నాలుగు నెలలుగా రాష్ట్రవ్యాప్తంగా దాడులు నిర్వహించడంతో వ్యాపారుల్లో కలకలం రేగింది. దీనికి సంబంధించిన వ్యాపారులను అరెస్టు చేశారు. అలాగే వివిధ మద్యం సిండికేట్ వ్యాపారులపై దాడులు నిర్వహించడంతో పోలీసులు, ఎక్సైజ్ అధికారులకు ఇచ్చే మామూళ్ళు, అధికారులు పెట్టిన పెట్టుబడుల విషయం బహిర్గతమైంది. దీనిపై పూర్తి స్థాయి నివేదిక ఇవ్వాలని ప్రభుత్వం ఆదేశించడంతో ఎసిబి విచారణను ముమ్మరం చేసింది. తెల్లరేషన్ కార్డులతో లైసెన్సు పొందిన వారిని విచారించిన ఎసిబి ఇప్పుడు మద్యం విక్రయాలపైనా దృష్టి సారించింది. నరసింహకొండలోని ఐఎంఎల్ డిపోలో విచారణ చేపట్టారు. ఇందులో ప్రతి అంశాలన్ని క్షుణంగా పరిశీలిస్తుండడంతో అక్రమ మద్యం వ్యాపారుల గుండెల్లో రైళ్ల పెరుగెడుతున్నాయి. ఈ సందర్భంగా ఎసిబి డిఎస్పీ భాస్కర్‌రావు మాట్లాడుతూ మద్యం సిండికేట్లపై జరుపుతున్న దర్యాప్తులో ఒక్కొక్కటిగా అక్రమాలు బయట పడుతున్నాయన్నారు. ఐఎంఎల్ డిపోలో చేసిన తనిఖీల్లో లైసెన్సుదారుడు కాకుండా సిండికేట్ నిర్వహకుల ఆధ్వర్యంలో మద్యం తరలింపు జరిపినట్లు నిర్ధారణ అయ్యిందన్నారు. తెల్లరేషన్ కార్డు కల్గిన మద్యం షాపుల వారికి నోటీసులు జారీ చేస్తున్నారు.



# మేము మొగుడు పెళ్లాలం!

- మొగుడు ఎవరు? పెళ్లామెవరు నారాయణగారు!



సిపిఐ పార్టీ ఆఫీసులో మాట్లాడుతున్న రాష్ట్ర కార్యదర్శి నారాయణ.

తన మాటలతో, చేష్టలతో నిత్యం వార్తల్లో వుండే వ్యక్తి సిపిఐ రాష్ట్రకార్యదర్శి నారాయణ. అలాంటి వ్యక్తి సిపిఎం, సిపిఐ పార్టీలను మొగుడు పెళ్లాలతో పోల్చారు. భార్యాభర్తల మాదిరిగానే తమ రెండు పార్టీలు కొట్టుకొంటూ, కలసుకొంటూ వుంటాం, అంతమాత్రాన తమ మధ్య విభేదాలున్నట్లు కాదని చెప్పుకొచ్చారు. నెల్లూరు వచ్చిన ఆయన సిపిఐ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. మొగుడు పెళ్లాలుగా వున్న మాకు (సిపిఎం, సిపిఐపార్టీలు) కలసి వుండాలని లేదు, విడిపోవాలని లేదు అంటూ మరో సంచలన వ్యాఖ్య చేశారు. 2009 ఎన్నికలప్పుడు చేసుకొన్న ఒప్పందాలకు అనుగుణంగానే ఈ ఎన్నికల్లోనూ ఆయా పార్టీలకు మద్దతిస్తున్నట్లు చెప్పిన నారాయణ, సీమాంధ్రలో మాత్రం సిపిఎంకు గెలిచే అవకాశాలు లేనందువల్లే తెలుగుదేశం పార్టీకి మద్దతు ఇస్తున్నట్లు చెప్పారు. పనిలో పనిగా ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిపై నోరుపారేసుకొన్నారు. ఆయనకు మైండ్ దొబ్బిందన్నారు. రాష్ట్రంలో ప్రజలు త్రాగునీటి సమస్యతో సతమతం అవుతుంటే ముఖ్యమంత్రి వాటి గురించి పట్టించుకోకుండా ఉప ఎన్నికలపైనే శ్రద్ధచూపుతున్నారని విమర్శించారు. రాష్ట్రంలో పత్తి, పసుపు, మిర్చి పంటలు సాగుచేస్తున్న రైతులు మద్దతు ధర లేక తీవ్రంగా నష్టపోతున్నారని వారికి అండగా నిలచి పోరాటం చేస్తామన్నారు. పార్లమెంటు సమావేశాల సందర్భంగా తెలంగాణ కాంగ్రెస్ ఎమ్పీలను సస్పెండ్ చేయడం యూపిఏ సర్కార్ ఆడుతున్న నాటకమని అభివర్ణించారు. పార్టీలో వుంటూ అధిష్టానానికి వ్యతిరేకంగా పనిచేస్తున్న ఎమ్పీలు ధైర్యం వుంటే, చిత్తశుద్ధి వుంటే రాజీనామా చేయాలన్నారు.

# లయన్స్ గవర్నర్‌గా అమృతవల్లి



లయన్స్ క్లబ్ గవర్నర్‌గా నెల్లూరుకు చెందిన యడ్లపల్లి అమృతవల్లి ఎన్నికైనారు. హోరాహోరీగా, రాజకీయ సమరాలను తలపించే రీతిలో జరిగిన ఎన్నికలో, వైఎస్.రాజశేఖర్‌రెడ్డి తమ్ముడు వైఎస్.వివేకానందరెడ్డి అభ్యర్థిని ఓడించి మరీ ఈ గౌరవనీయమైన స్థానం అలంకరించారామె.

శ్రీమతి అమృతవల్లి – హోటల్ శివం అధినేత, మాజీ లయన్స్ గవర్నర్, ఎంత ఎదిగినా ఒదిగి వుండే వినయశీలి, సిరిసంపదల కంటే స్నేహసంపద విలువైనదన్న సూత్రాన్ని పాటించి చూపే మంచి మిత్రుడు యడ్లపల్లి సురేష్ సతీమణి. ఒకే ఇంట్లో ఇద్దరు లయన్స్ గవర్నర్ పదవికి ఎంపిక కావడం చాలా అరుదైన విషయం. ఆ ఘనతను సాధించిన యడ్లపల్లి దంపతులకు మా అభినందనలు.

# గురువు పాత్ర కీలకం

**కావలి విద్యా సదస్సులో ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు**

కావలి పట్టణంలో ఇటీవల ఉపాధ్యాయుల సదస్సు, విద్యార్థి సంఘం వారు నిర్వహించిన మోడల్ ఎంసెట్ జరగడంతో కోలాహలం నెలకొనింది. ఒక వైపు ఎంసెట్‌కు ప్రిపేరయ్యే విద్యార్థులు, మరోవైపు సదస్సుకు హాజరయ్యే ఉపాధ్యాయులతో సందడి నెలకొంది. స్థానిక గొట్టిపాటి కళ్యాణ మండపంలో ఎస్‌టియు విద్యాసదస్సు నిర్వహించగా శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు, వైకాపా నేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, కాంగ్రెస్‌పార్టీకి చెందిన దామిశెట్టి శ్రీనివాసులు నాయుడు హాజరయ్యారు. గురువు దైవంతో సమానమని, విద్యార్థులు ఉన్నతస్థాయికి చేరుకోవడంలో వారి పాత్ర ఎంతో వుందన్నారు. ప్రభుత్వం కార్పొరేట్ విద్యాసంస్థల పట్ల ప్రేమ ఒలకబోస్తూ ప్రభుత్వ పాఠశాలలను నిర్వీర్యం చేస్తున్నాయని ప్రతాప్‌కుమార్‌రెడ్డి విమర్శించారు. ఈ కార్యక్రమంలో ఎస్‌టియు నాయకులు కృష్ణయ్య తదితరులు పాల్గొన్నారు. అలాగే ఎస్‌ఎఫ్‌ఐ ఆధ్వర్యంలో స్నేహ జూనియర్ కళాశాలలో జరిగిన మోడల్ ఎంసెట్ ప్రశ్నాపత్రాన్ని విడుదల చేశారు ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు. ప్రముఖ విద్యావేత్త చుక్కా రామయ్య ఆధ్వర్యంలో విద్యార్థులకు ప్రయోజనకరంగా వుండేలా మోడల్ ఎంసెట్ నిర్వహించడం అభినందనీయం అన్నారు. ఎస్‌ఎఫ్‌ఐ జిల్లా అధ్యక్షుడు కిరణ్‌కుమార్ తదితరులు వీటిని నిర్వహించారు.

# కావలిలో రౌడీ మేళా

**మహిళా డిఎస్‌పి అయినా కరకుగానే పనిచేస్తున్నారు**

కావలి పట్టణంలో ఇటీవల కొంతకాలంగా సంఘవిద్రోహశక్తులు, రౌడీలు పెట్రేగిపోతుండడంతో పోలీసులు వారికి ముక్కుతాడు వేసేందుకు రంగం సిద్ధం చేశారు. సబ్‌డివిజన్ పరిధిలో మేళా నిర్వహించారు. మహిళలపై అఘాయిత్యాలు పెరగడం, రౌడీ మూకల సంచారం అధికం కావడంతో పోలీసులు ఈ కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా డిఎస్‌పి ఇందిర మాట్లాడుతూ ఎవరైనా తోక జాడిస్తే చూస్తూ ఊరుకోమన్నారు. ఈవ్‌టీజింగ్‌కు పాల్పడినా, ఫోన్లలో వేధించినా, మహిళపై అఘాయిత్యాలకు పాల్పడినా కఠినంగా వ్యవహరిస్తామన్నారు. అలాంటి వారిపై రౌడీ షీట్ తెరుస్తామని హెచ్చరించారు. ఉపఎన్నికలకు సంబంధించి పటిష్టమైన భద్రత చర్యలు చేపడుతున్నామన్నారు. రౌడీమేళాలో కావలి, కావలి రూరల్, కలిగిరి, ఉదయగిరి పరిధిలోని 12పోలీస్ స్టేషన్లకుచెందిన 46 మంది రౌడీలు హాజరయ్యారు. కావలి పట్టణ సిఐ రాంబాబు, రూరల్ సిఐ ప్రసాద్, కలిగిరి సిఐ రమణ, ఉదయగిరి సిఐ కళ్యాణ్‌రాజ్ తదితరులు పాల్గొన్నారు.

● **నెల్లూరులో**

# ఇక నుంచి నిత్య కళా తిరునాళ్లు!



తొలిచూపులో అంకురించిన ప్రేమ కడదాకా నిలుస్తుందట. సోనియమ్మ పిలుపు మేరకు నెల్లూరు లోక్‌సభ కాంగ్రెస్ అభ్యర్థిగా వస్తున్న తిక్కవరపు సుబ్బరామరెడ్డి మొదటి పలకరింపులోనే నెల్లూరు ప్రజల మనసులు కొల్లగొట్టే ప్రణాళిక రచించాడు. సుబ్బరామరెడ్డి గారు ఎక్కడుంటే అక్కడంతా సందడి ఉంటుంది. ఇంతకాలం ఆ భాగ్యం విశాఖ ప్రజల స్వంతం. ఇకనుంచి నెల్లూరు వాసుల అదృష్టం. రేపు 6వ తేది ఆదివారం సాయంత్రం 4 గంటలకు కస్తూరిదేవి విద్యాలయ ప్రాంగణంలో సుబ్బరామరెడ్డి గారి కళాపిపాసను కళ్ల ముందు నిలిపే మొట్టమొదటి సంరంభం జరగబోతున్నది. టి.సుబ్బరామరెడ్డి లలిత కళా పరిషత్ నెల్లూరు శాఖ ప్రారంభం – కార్యక్రమం. అందుకు నాందిగా సినీ నటుడు మోహన్‌బాబుకు "నట వాచస్పతి" అనే బిరుదు ప్రదానం చేయబోతున్నారు.

సినిమాలలో రజనీకాంత్‌కు స్వంత శైలి ఉన్నట్లు, కళా రంగంలో టిఎస్ఆర్‌కు ఒక వింత శైలి ఉంది. అదేమిటో ఈ సభలో నెల్లూరు వాసులందరూ చూసి తరించే అవకాశం లభిస్తున్నది. సభలో పాల్గొనే అతిథులు, ఆహ్వానితుల జాబితా అనంతం. అక్కినేని నాగేశ్వరరావు, వాణిశ్రీ, డి.రామానాయుడు, మురళీ మోహన్, కోడి రామకృష్ణ, పరుచూరి వెంకటేశ్వరరావు, పరుచూరి గోపాలకృష్ణ, బ్రహ్మానందం, రాజశేఖర్, జీవిత, జయసుధ, మీనా, శ్రద్ధాదాస్, అర్చన, దీక్షాసేథ్, పూనమ్‌కౌర్ తదితర తారాగణమంతా వేదిక మీద కనువిందు చేయబోతున్నది. మరొక ప్రక్క రాజకీయ రంగం నుంచి నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి, మహీధర్‌రెడ్డి, పనబాక లక్ష్మి, నేదురుమల్లి రాజ్యలక్ష్మి, పితాని సత్యనారాయణ, మాగుంట శ్రీనివాసులురెడ్డి, ఆదాల ప్రభాకర్ రెడ్డి, వాకాటి నారాయణరెడ్డి, చింతా మోహన్, ఆనం వివేకానందరెడ్డి... ఓ యమ్మో అన్ని పేర్లూ వ్రాయాలంటే చేతులు నొప్పి పుడతాయి. ఇది చాలదన్నట్లు సుప్రసిద్ధ సినీ సంగీత దర్శకుడు చక్రి మ్యూజికల్ నైట్ నిర్వహిస్తున్నారు.

మొత్తంమీద సుబ్బరామరెడ్డి గారి నెల్లూరు ప్రథమ పర్యటన అదిరి పోబోతున్నది.

# గూడూరు మునిసిపాలిటీకి మహిళా కమిషనర్!

**● బాధ్యతగా పనిచేసి పేరు తెచ్చుకోండి**

ఏడాది కాలంగా ఇన్‌చార్జీల పాలనలో నడుస్తున్న గూడూరు పురపాలక సంఘానికి ఎట్టకేలకు రెగ్యులర్ కమిషనర్‌ను నియమించింది ప్రభుత్వం. ఒంగోలు మునిసిపల్ కార్పొరేషన్ కార్యాలయంలో మేనేజర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్న జిసి.సుశీలమ్మను పదోన్నతిపై ఇక్కడకు కమిషనర్‌గా నియమించారు. ఆమె గతంలో గూడూరు మున్సిపల్ కార్యాలయంలో అకౌంటెంట్‌గా పనిచేసి వున్నారు. ఏడాదిగా రెగ్యులర్ కమిషనర్ లేకపోవడంతో మునిసిపాలిటీ అన్నివిధాలా భ్రష్టుపట్టిపోయింది. పారిశుధ్య, త్రాగునీటి సమస్య, ఆక్రమణలతో గూడూరు పట్టణం అస్తవ్యస్తంగా తయారయ్యింది. ఈ పరిస్థితుల్లో కొత్త కమిషనర్ వచ్చిన తర్వాత పనితీరు ఎలా వుంటుందోనన్న దానిపై చర్చ జరుగుతోంది.

# ఉప ఎన్నికలు కీలకమైనవి

రాష్ట్రంలో జరుగనున్న ఉప ఎన్నికలు రాష్ట్ర రాజకీయాలను ప్రభావితం చేస్తాయని మాజీ ఎమ్మీ వైకాపా నేత జ్ఞానేందర్‌రెడ్డి తెలిపారు. ఇటీవల కావలి వచ్చిన ఆయన నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డితో కలసి విలేకరులతో మాట్లాడారు. తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలు కుమ్మక్కై వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీని అడ్డుకొనేందుకు కుయుక్తులు పన్నుతున్నాయన్నారు. వారు ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఎంత డబ్బు ఇచ్చినా, మద్యాన్ని ఏరుల్లా పారించినా ప్రజల్లో జగన్‌కున్న ఆదరణను, వారి గుండెల్లో గూడుకట్టుకున్న వైఎస్ రాజశేఖర్‌రెడ్డిపై వున్న అభిమానాన్ని ఎవరూ ఏమీ చేయలేరని, తమ పార్టీ విజయాన్ని ఎవరూ అడ్డుకోలేరని, ఒక మంచి నాయకుడిని కోల్పోతే రాష్ట్రం ఎంత అతలాకుతలమౌతుందో ఇప్పుడు మనం చూస్తున్నామని ప్రతాప్‌కుమార్‌రెడ్డి అన్నారు.

# ప్రజల పట్ల బాధ్యతగా మెలగండి!

ప్రజాప్రతినిధులైనా, అధికారులైనా ప్రజలపట్ల బాధ్యతాయుతంగా మెలగని పక్షంలో దోషులుగా నిలబడాల్సి వస్తుందని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు అన్నారు. ప్రజాపథం కార్యక్రమం, అందులో వచ్చే అర్జీలపై అధికారులు తగినశ్రద్ధ వహించడం లేదని, పేదలకు కాకుండా ధనవంతులకు కొమ్ము కాస్తున్నారని పలువురు అధికారుల తీరుపై ఎమ్మెల్యేలకు ఫిర్యాదు చేశారు. నివేశన స్థలాలు, ఇందిరమ్మ ఇళ్లు, ఫించన్లు, రేషన్‌కార్డుల మంజూరులో కొందరు మాజీ కౌన్సిలర్లు, అధికారులు అక్రమాలకు పాల్పడుతున్నారని ఆరోపించారు. బిపిఎల్ సర్వే పేరుతో పట్టణంలో రెండువేలకుపైగా రేషన్ కార్డులు తొలగించారని ఆవేదన వ్యక్తం చేయడంతో బీద మస్తాన్‌రావు దీనిపై తీవ్రంగా స్పందించారు. ప్రజల నుంచి స్వీకరించే అర్జీలను పరిశీలించి తగిన న్యాయం చేయాలని లేని పక్షంలో ప్రజాపథాలు ఇతరత్రా కార్యక్రమాలు నిర్వహించి ఉపయోగం లేదన్నారు.



కలెక్టర్ సరస్వతి నిధికి 50వేల రూపాయల విరాళాన్ని నెల్లూరు కృష్ణచైతన్య విద్యాసంస్థల తరపున కలెక్టర్ శ్రీధర్‌రెడ్డికి అందిస్తున్న విద్యాసంస్థల డైరక్టర్లు కృష్ణారెడ్డి, చంద్రశేఖర్‌రెడ్డి.

# గూడూరు మునిసిపాలిటీలో పాలనేది?

## ప్రజా సమస్యలు పట్టించుకొనేవారు లేరు

మునిసిపాలిటీల పాలకవర్గం స్థానంలో ఇన్‌చార్జీల పాలన రావడంతో అభివృద్ధి సంగతి దేముదెరుగు, ప్రజాసమస్యలు పట్టించుకొనే వారేలేక పరిస్థితులు నానాటికి దిగజారిపోతున్నాయి. దీనికి ఉదాహరణ గూడూరు పట్టణం. పారిశుధ్యం క్షీణించడం, త్రాగునీటి సమస్యతో ప్రజలు సతమతం అవుతున్నారు. ఇన్‌చార్జి కమిషనర్ వున్నా పురపాలక సంఘంలో ప్రజల బాగోగులు ఎవరికి పట్టడం లేదు. ఎవరికి వారు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తుండడంతో నాధుడు లేని పాలన అయ్యింది. ఇక కబ్జాదారులు చెలరేగిపోతున్నారు. ఎక్కడికక్కడ ప్రభుత్వ స్థలాలు, రోడ్లు, కాలువలను కబ్జా చేసేస్తున్నారు. అడిగేవారే లేకుండా పోవడంతో అక్రమణలు రోజురోజుకు అధికం అవుతున్నాయి. ఏడాది క్రిందట పురపాలక సంఘం కమిషనర్‌గా పూర్ణచంద్రరావు పని చేశారు. ఆయన సెలవుపై వెళ్లడంతో సీతారామరావు ఇన్‌చార్జి కమిషనర్‌గా వ్యవహరిస్తున్నారు. ప్రధానమైన శానిటరీ విభాగానికి ఇన్‌చార్జీ దిక్కు. ఈ విభాగంలో పని చేస్తున్న సాంబశివరావు పదోన్నతిపై వెళ్లడంతో ఎఇ శ్రీనివాసులరెడ్డి ఇన్‌చార్జీ బాధ్యతలు నిర్వర్తిస్తున్నాడు. పూర్తిస్థాయి అధికారులు లేకపోవడంతో పట్టణంపై దీని ప్రభావం పడుతోంది. ఎక్కడికక్కడ చెత్తకుప్పలు పేరుకపోతున్నాయి. వీధి దీపాలు సక్రమంగా వెలగక పట్టణ ప్రజలు పలు అవస్థలు పడుతున్నారు. ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని పట్టణంలో పారిశుధ్య పరిస్థితులు మెరుగు పరచాలని, కనీస సౌకర్యాలు కల్పించాలని స్థానికులు కోరుకొంటున్నారు.

● మళ్లీ

# మనీస్కీం ఏజంట్ల హల్‌చల్!

ఏడాది క్రిందట మనీస్కీం పేరుతో పేదల నుంచి పెద్ద మొత్తంలో డబ్బులు వసూలు చేసి పరారైన ఏజంట్లు తిరిగి సంచరిస్తుండడం బిట్రగుంట ప్రాంతంలో కలకలం రేపుతోంది. 'హిం' సంస్థ పేరుతో వసూళ్లకు పాల్పడిన ఏజెంట్లు తిరిగి రావడంతో ప్రజలు ఆశ్చర్యపోతున్నారు. కావలి, బోగోలు, అల్లూరు, దగదర్తి తదితర ప్రాంతాలలో ప్రజల నుంచి పెద్దమొత్తంలో డబ్బులు కట్టించుకొన్నారు ఏజెంట్లు. అయితే ఆ తర్వాత పోలీసు దర్యాప్తు జరపడంతోపాటు కొందరిని అరెస్టు చేశారు. మరికొందరు పోలీసులకు మస్కాకొట్టి పారిపోయారు. బిట్రగుంట పోలీసులు చూసి చూడనట్లు వదిలేయడంతో తిరిగి వారు ఈ ప్రాంతంలో ప్రత్యక్షం అయ్యారు. ఖరీదైన కార్లలో తిరుగుతుండడంతో వీరిని నమ్మి లక్షలాది రూపాయలు కట్టి నట్టేట మునిగిన ప్రజలు మాత్రం ఇంకా న్యాయం జరుగుతుందేమోనన్న ఆశతో పోలీసుల చుట్టూ తిరుగుతున్నారు.

## ఆశ్చర్యపోతున్న ప్రజలు

# పోలీసుల స్థలానికే రక్షణ లేదు!

## మర్రిపాడులో పరిస్థితిది

ప్రజలకు రక్షణ కల్పించే రక్షకభటుల స్థలాలకే మర్రిపాడు, డిసిపల్లెలలో రక్షణ లేకుండా పోయింది. ఈ ప్రాంతంలో రెండు పోలీస్ స్టేషన్లు వుండేవి. వీటిని మండల కేంద్రానికి తరలించారు. ఈ పోలీస్ స్టేషన్‌ను 1884 సంవత్సరంలో నిర్మించినట్లు పోలీస్ రికార్డులు చెబుతున్నాయి. రంగూన్ టేకుతో, పెంకులతో నిర్మించిన ఈ పోలీస్ స్టేషన్ పటిష్టంగా వుంటుంది. సిబ్బంది నివాసానికి ఇక్కడే క్వార్టర్లు నిర్మించారు. అయితే పాతికేళ్లుగా వీటిని పట్టించుకొనేవారు లేకపోవడంతో పోలీస్‌లకు వివిధ అవసరాల నిమిత్తం కేటాయించిన స్థలం అన్యాక్రాంతమవుతోంది. క్వార్టర్లు నిరుపయోగంగా మారడంతో అందులోని విలువైన కలపను దోచుకపోయారు. కలప మాయం కావడంతో తీరిగ్గా కలదెలుసుకొని పోలీస్ అధికారులు గోడలు కూల్చేశారు. దీంతో కబ్జాదారుల కన్ను ఈ స్థలంపై పడింది. డిసిపల్లి పోలీస్‌స్టేషన్ ఐదెకరాల విస్తీర్ణంలో వుంది. ఈ స్థలాన్ని ప్రక్కనే గల ప్రాథమిక పాఠశాల విద్యార్థులు ఆట స్థలం కోసం కేటాయించాలని అడగ్గా అధికారులు పట్టించుకోలేదు. దీంతో చుట్టుప్రక్కల ప్రాంతాల వారు పేడదిబ్బలు వేసుకొంటూ మెలమెల్లగా చాలా వరకు స్థలాన్ని కబ్జా చేసేశారు. గొర్రెల కాపరులు కొంతస్థలంలో దొడ్లు వేసుకొన్నారు. పాత పోలీస్‌స్టేషన్ పరిస్థితి ఇలాగే వుంది. చాలామంది ఏకంగా ఇళ్లు నిర్మించుకొన్నా పట్టించుకొనే వారు లేకపోవడంతో పోలీస్‌స్టేషన్ స్థలాలు అన్యాక్రాంత మవుతున్నాయి. ఇప్పటికైనా అధికారులు స్పందించి ఈ స్థలాలను కబ్జాదారుల చెర నుంచి విడిపించి ప్రజలకు ఉపయోగపడేట్లు చేయాలని పలువురు కోరుకొంటున్నారు.

# సూళ్లూరుపేట ఎంఇఓపై విచారణ!

సూళ్లూరుపేట మండల విద్యాధికారి సొక్రటీస్‌పై వచ్చిన ఆరోపణలపై డిప్యూటి డిఇఓ ప్రసన్నాంజనేయులు విచారణ జరిపారు. మండలంలోని రాజీవ్‌నగర్ ప్రాథమిక పాఠశాల స్కూలు మేనేజ్‌మెంట్ కమిటీ అధ్యక్షుడు పొన్నా కోటయ్య ఎంఇఓపై వివిధ ఆరోపణలు చేస్తూ లోకాయుక్తకు ఫిర్యాదు చేశాడు. వికలాంగులకు వచ్చే నిధులను దుర్వినియోగం చేశాడని, ఆర్‌విసి, ఆర్‌విఎం నిధుల దుర్వినియోగం, వాచ్‌మెన్ పేరుతో జీతాన్ని దిగమింగాడని, ప్రాథమిక పాఠశాల స్థలాన్ని ఆక్రమించి ఇళ్లు కట్టుకొన్నాడని పలు ఆరోపణలు చేశాడు. ఈ అభియోగాలపై విచారణ చేపట్టిన ఉప విద్యాశాఖధికారి ప్రసన్నాంజనేయులు మాట్లాడుతూ వీటిపై ప్రశ్నావళి తయారు చేసి ఎంఇఓకు ఇచ్చామని, వాటికి ఆయనిచ్చే సమాధానాలపై నివేదిక తయారు చేసి జిల్లా విద్యాశాఖాధికారికి అందజేస్తామన్నారు.

## పేరు ఘనం - చేసే పనులు పనికి మాలినవి

# మభ్యపెట్టే ప్రజాపథం!

## వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల



ప్రజాపథం కేవలం ప్రజలను మభ్యపెట్టే కార్యక్రమం అని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ విమర్శించారు. నియోజకవర్గంలో వివిధ ప్రాంతాలలో జరిగిన ప్రజాపథం కార్యక్రమానికి హాజరై ప్రభుత్వ లోపాలను ఎత్తి చూపారు. ఫించన్లు, రేషన్ కార్డుల వంటివి మంజూరు చేసే అవకాశం లేకుండా నిర్వహిస్తున్న ఈ కార్యక్రమానికి హాజరుకావడం శుద్ధదండగని బాలాయపల్లిలో వ్యాఖ్యానించారు. మొక్కుబడిగా నిర్వహించే ప్రజాపథం వల్ల ప్రజలకు ఎలాంటి ప్రయోజనం చేకూరడం లేదన్నారు. డక్కిలి మండలం చాపలపల్లిలో కొందరు ఉద్దేశపూర్వకంగానే సభను ప్రక్కదారి పట్టించారని ఎమ్మెల్యే ఆగ్రహం వ్యక్తం చేశారు. తాను త్రాగునీటి కోసం 9 లక్షల రూపాయలు మంజూరు చేయించానని, నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ ఈ గ్రామానికి ఏమి చేశారని ప్రశ్నించారు. ఈ సందర్భంగా పలు గ్రామాల ప్రజలు కురుగొండ్లకు మద్దతుగా నిలచి అధికారుల తీరుపై ఆగ్రహం వ్యక్తం చేశారు. కామకూరు, పిగిలాం, కాలగందల్లో ప్రజల నుంచి తీవ్ర నిరసన వ్యక్తమయ్యింది. ఉపాధిపనులు కల్పించడంలో సిబ్బంది పక్షపాతం చూపుతున్నారని ఘర్షణ పడ్డారు. పిగిలాంలో విద్యుత్ సరఫరా సరిగా లేదని అధికారులను సభలోనికి రానివ్వకుండా అడ్డుకోవడంతో ఉద్రికత్త నెలకొనింది. పలు ప్రాంతాలలో ఇలాంటి ఘటనలే చోటు చేసుకోవడంతో ప్రజాపథం కార్యక్రమం గందరగోళంగా మారింది.

# రాజమోహన్‌రెడ్డిని గెలిపించండి!



ఇందుకూరుపేట మండలంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ విజయోత్సవ ర్యాలీ నిర్వహించింది. కోవూరు నియోజకవర్గ ఉప ఎన్నికలలో ఆ పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి విజయం సాధించిన సందర్భాన్ని పురస్కరించుకొని పార్టీ నేత గునపాటి సురేష్‌రెడ్డి ఈ విజయోత్సవ ర్యాలీ నిర్వహించారు. కోవూరు శాసన సభ్యుడు ప్రసన్నకుమార్‌రెడ్డి మాట్లాడుతూ అధికార కాంగ్రెస్‌పార్టీ, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీలు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని ఎదుర్కోవడానికి లోపాయికారి ఒప్పందం కుదుర్చుకొన్నాయని ఆరోపించారు. వారు ఎన్ని కుట్రలు చేసినా, కుతంత్రాలు పన్నినా రాష్ట్ర ప్రజలు జగన్ వెంటే వున్నారని, వైఎస్ కుటుంబం పట్లే ఆదరణ చూపిస్తున్నారన్నారు.

## ఇందుకూరుపేటలో ప్రసన్న

వైఎస్ ఆశయాలు కొనసాగాలంటే జగన్మోహన్‌రెడ్డి ముఖ్యమంత్రి కావాలన్నారు. నెల్లూరు పార్లమెంటు స్థానానికి జరిగే ఎన్నికల్లో వైఎస్ కోసం పదవిని వదలుకొన్న రాజమోహన్‌రెడ్డిని అఖండ మెజార్టీతో గెలిపించాలన్నారు. పార్లమెంటు ఉప ఎన్నికలలో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు నేతలు, ఓటర్లు కరువయ్యారని కాకాణి గోవర్ధన్‌రెడ్డి వ్యాఖ్యానించారు. బయటి నుంచి అభ్యర్థులను తీసుకురావాల్సిన పరిస్థితి ఏర్పడిందని ఎద్దేవా చేశారు. కోవూరు ఎన్నికల ఫలితాలను దేశమంతా చూసిందని, అలాంటి ఫలితాన్ని తిరిగి పార్లమెంటు బరిలో వున్న మేకపాటి రాజమోహన్‌రెడ్డికి ఇచ్చి భారీ మెజార్టీతో గెలిపించాలని కోరారు.



పదవీ విరమణ చేసిన నెల్లూరు కెవిసి కాలేజి ప్రిన్సిపాల్ దొనపాటి సూర్యనారాయణరెడ్డి దంపతులను సన్మానిస్తున్న దంత వైద్యుడు డి.నారాయణరెడ్డి.

## చెంగాళమ్మ హుండీ ఆదాయం 17.47 లక్షలు

సూళ్లూరుపేట చెంగాళమ్మ దేవస్థానం హుండీ ఆదాయం 17.47 లక్షల రూపాయలుగా ఉన్నట్లు ఇఓ శ్రీనివాసులురెడ్డి తెలిపారు. 23వ తేదీన పాలకమండలి ఛైర్మన్ ఇసనాక హర్షవర్ధన్ రెడ్డి, దేవాదాయ ఇన్‌స్పెక్టర్ సుధాకర్‌ల సమక్షంలో ఈ లెక్కింపు జరిపారు. ఆలయంలో జరిగే నిత్యాన్నదాన పథకానికి తడ మండలం చేనిగుంటకు చెందిన బాలకృష్ణారెడ్డి 50వేల రూపాయల చెక్కును అందజేశారు.

## నన్ను గుర్తించడం లేదు!

● గూడూరు ఎమ్మెల్యే ఆవేదన

గూడూరు ప్రాంతంలో అధికారులు పక్షపాతంగా వ్యవహరిస్తున్నారని స్థానిక శాసనసభ్యుడినైన తనను ప్రక్కన పెట్టి ఓడిపోయిన వ్యక్తులు, అధికారపార్టీ నేతలకు కొమ్ముకాస్తున్నారని బల్లి దుర్గాప్రసాద్ ఆరోపించారు. పట్టణంలో జరిగిన కార్యక్రమానికి హాజరైన ఆయన అధికారుల తీరుపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. ప్రతిసారి మహిళా సంఘాలకు ఓడిపోయిన వ్యక్తుల ద్వారా చెక్కులు పంపిణీ చేయడం ఎంతవరకు సబబు అని పనబాక కృష్ణయ్యను ఉద్దేశించి వ్యాఖ్యానించారు. పట్టణంలోని వివిధ ప్రాంతాల అభివృద్ధికి కలెక్టర్ ద్వారా ప్రతిపాదనలు పంపి వాటిని మంజూరు చేయిస్తే ఆయన మాత్రం అంతా తాను సాధించు కొచ్చినట్లు ప్రజల ముందు బీరాలు పలుకుతున్నారని విమర్శించారు. గతంలో ప్రజలు ఇచ్చిన అర్జీలకు ఇంతవరకు దిక్కులేదని, అలాంటి దానికి ప్రజాపథం నిర్వహించడం ఎందుకని ప్రశ్నించారు. కనీసం ప్రజాపథం ఎక్కడ జరుగుతుందో తనకు తెలియడంలేదని, అధికారులు ఆ సమాచారాన్ని తనకు ఇవ్వడం లేదని ఈ విషయాన్ని కలెక్టర్ దృష్టికి తీసుకెళతానని చెప్పారు.

## బాధ్యతాయుతంగా వ్యవహరించండి!

పోలీసులకు పరసా క్లాసు



ఖాకీ డ్రస్సుకు కళంకం తెచ్చేలా పోలీసులు వ్యవహరిస్తున్నారని సూళ్లూరుపేట శాసన సభ్యుడు పరసారత్నం విమర్శించారు. ఇటీవల నాయుడుపేటలో ప్రజాపథంలో పాల్గొనేందుకు వచ్చిన ఆయనకు వివిధ సమస్యలపై స్థానికులు వినతిపత్రం అందజేశారు. ఈ సందర్భంగా పోలీసుస్టేషన్‌కు వెళ్తే న్యాయం జరగడం లేదని కొందరు ఫిర్యాదు చేయడంతో పై విధంగా స్పందించారు. న్యాయం కోసం స్టేషన్‌కు వచ్చే బాధితులకు అండగా నిలవాల్సిన పోలీసులు ఆ పని చేయకుండా అధికారానికి, డబ్బుకు లొంగి ఫిర్యాదుదారులనే బెదరింపులకు గురి చేయడం బాధాకరం అన్నారు. ఏళ్ల తరబడి పోలీస్ స్టేషన్లలో పాతుకపోయిన కొందరు పోలీసు సిబ్బంది బదలీపై వచ్చే అధికారులను సైతం తప్పుదోవ పట్టిస్తున్నారని విమర్శించారు. ఇప్పటికైనా పోలీసులు ఖాకీ దుస్తుల గౌరవాన్ని కాపాడాలని, బాధితులకు అండగా నిలచి న్యాయం జరిగేలా చూడాలని కోరారు.

## పోలీసు సంక్షేమంపై దృష్టి

వెంకటగిరి బెటాలియన్‌లో అరుణా బహుగుణ

పోలీస్ కుటుంబాల సంక్షేమం కోసం ప్రత్యేక దృష్టి సారిస్తున్నట్లు బెటాలియన్ల విభాగం అదనపు డిజి అరుణా బహుగుణ తెలిపారు. ఇటీవల వెంకటగిరి 9వ బెటాలియన్‌కు విచ్చేసి పోలీస్ కుటుంబాలతో సమావేశం అయ్యారు. బెటాలియన్ పోలీసులు గతంలో ఎక్కువగా దూర ప్రాంతాలలో విధులు నిర్వహిస్తుంటే, వారి కుటుంబాలు మాత్రం బెటాలియన్ ప్రాంగణంలో సురక్షితంగా వున్నప్పటికీ అసౌకర్యాన్ని గుర్తించి నెలవిడిచి నెల హెడ్ క్వార్టర్స్‌లో కుటుంబ సభ్యులతో సమయం గడిపేలా నిబంధనలు సడలించామన్నారు. ఇక్కడి సిబ్బందికి వసతుల కల్పనకు అవసరమైన చర్యలు తీసుకొంటున్నట్లు వివరించారు. పోలీస్ కుటుంబాలు ప్రశాంతంగా వుంటేనే పోలీసులు విధులు సక్రమంగా నిర్వహించగలరన్నారు. సంక్షేమ కార్యక్రమాల అమలుపై సంతృప్తి వ్యక్తం చేశారు. బెటాలియన్ కమాండెంట్ నాగూర్ రెడ్డి మాట్లాడుతూ ఎమ్పీ నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి నిధుల నుంచి 50లక్షల రూపాయలతో బెటాలియన్‌లో పలు వసతులు కల్పించినట్లు తెలిపారు. ఈ కార్యక్రమంలో అదనపు కమాండెంట్ ప్రసాద్, వ్యక్తిత్వ వికాస నిపుణులు సుధాకర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## వెంకన్న పాదాలను తాకిన సూర్యకిరణాలు

తడ మండలం వేనాడులోగల శ్రీరంగ పెరుమాళ్లు ఆలయంలోని వెంకన్న పాదాలను 22వ తేది సాయంత్రం సూర్యకిరణాలు సంపూర్ణంగా తాకాయి. ప్రతి ఏడాది ఏప్రెల్ నెలలో మూడు రోజులపాటు ఈ దృశ్యం కనువిందు చేయడం ఆనవాయితీ. ఈ సంవత్సరం సూర్యభగవానుని కిరణాలు వెంకన్నపాదాలు తాకడంతో భక్తులు పులకించిపోయారు.

● ఆదర్శ

## వ్యవసాయ క్షేత్రాలు!

వ్యవసాయశాఖ ప్రయోగం

రైతులకు సమగ్ర యజమాన్యం పట్ల అవగాహన కల్పించేందుకు వ్యవసాయశాఖ, ఆత్మ సంయుక్తంగా జిల్లాలో 108 ఆదర్శ వ్యవసాయ క్షేత్రాలను ఏర్పాటు చేస్తున్నట్లు ఆత్మ ప్రాజెక్టు డైరక్టరు గోవిందరాజులు తెలిపారు. వెంకటగిరికి వచ్చిన ఆయన వివిధ అంశాలపై విలేకరులతో మాట్లాడారు. ఈ ఖరీఫ్ సీజన్ నుంచే ఆదర్శ క్షేత్రాల పథకాన్ని అమలు చేస్తామన్నారు. 108 గ్రామాల్లో వీటిని ఏర్పాటు చేసేందుకు ఆయా గ్రామాల నుంచి ఒక్కొక్క రైతును ఎంపిక చేయనున్నట్లు తెలిపారు. క్షేత్రాలను సక్రమంగా నిర్వహించేందుకు మండలస్థాయి వ్యవసాయ శాఖాధికారులు, విస్తరణ అధికారులు అవగాహన పెంచుకోవాలన్నారు. అనంతరం వ్యవసాయశాఖ కార్యాలయంలో జరిగిన శిక్షణా కార్యక్రమాల్లో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో వ్యవసాయశాఖ ఎడి వెంకటేశ్వర్లు మండల వ్యవసాయశాఖ, విస్తరణ అధికారులు పాల్గొన్నారు.

● కొళాయి

## నీళ్లలో పురుగులు

కావలి ప్రజలకు ఎంత కష్టం?

కావలి పట్టణంలో నీటి సరఫరా అస్తవ్యస్తంగా మారింది. ట్యాంకులను సక్రమంగా శుభ్రపరచక కొళాయిల్లో వచ్చే నీటిలో పురుగులు వస్తుండడంతో పట్టణ ప్రజలు అనారోగ్యం పాలవుతున్నారు. రెండవ వార్డు పరిధిలోని మానికలవారి వీధి, ఇస్లాంపేట, రాజీవ్ నగర్, జొన్నాయిగుంట, ఒకటోవార్డు పరిధిలో గల జెండావీధి ప్రాంతాలలో మంచినీటి కొళాయిల్లో పురుగులు వస్తున్నాయి. దీనిపై పలుమార్లు మునిసిపల్ అధికారులకు విన్నవించుకొన్నా ఫలితం లేకుండా పోయిందని వాపోతున్నారు స్థానికులు. కలుషిత నీరు సరఫరా అవుతున్నా, రోగాలబారిన పడుతున్నా పట్టించుకొనేనాథుడే లేకుండా పోవడంతో కావలిలో పరిస్థితి అస్తవ్యస్తంగా మారింది.

## పారిశుధ్య కార్మికుల పరిస్థితి దయనీయం

సూళ్లూరుపేట మునిసిపల్ పారిశుధ్య కార్మికుల పరిస్థితి దయనీయంగా వుంది. గత 12 నెలలుగా జీతాలు అందక కార్మికుల కుటుంబాల పోషణ కష్టతరంగా మారింది. దిక్కుతోచని స్థితిలో అధిక వడ్డీలకు అప్పు తెచ్చుకొని జీవించాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. నిద్ర లేచింది మొదలు పొద్దుపోయే వరకు పట్టణంలో వున్న మురికి కాలువలు, చెత్తా చెదారాలను తొలగించే కార్మికులకు రావాల్సిన జీతాలు నెలలు గడుస్తున్నా అందకపోవడంతో విసిగి వేసారిన కార్మికులు చివరకు సిపిఎం పార్టీ ఆధ్వర్యంలో ధర్నాకు దిగారు. జీతాల కోసం అధికారులను సంవత్సర కాలంగా వేడుకొంటున్నా అదిగో ఇదిగో అంటూ కాలం గడుపుతున్నారు తప్ప తమ గురించే పట్టించుకోలేదని ఆవేదన వ్యక్తం చేశారు. పంచాయితీ వున్నప్పుడూ ఇదే పరిస్థితి అని, చివరకు హోదా మారి మునిసిపాలిటీగా మారినా తమ జీతాలు చెల్లింపులో అన్యాయం జరుగుతోందని వాపోయారు. ఎందుకు తమ పట్ల అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారో అర్థం కావడం లేదని కన్నీళ్ల పర్యంతం అవుతున్నారు.

# సణుగుడు

* **మళ్లీ మొదలు**
* **నెల్లూరుపై విషం చిమ్ముతున్న లీగల్ మాఫియా**

నువ్వెందుకు సణగడంలేదీమధ్య అని చాలా మంది నిలదీస్తున్నారు. సణగడం అంటే చెప్పదల చింది సున్నితంగా చెప్పడం. మెత్తటి చెప్పుతో కొట్టడం. అయితే, ఇప్పటి సమాజంలో అందరి చర్మాలూ మొద్దుబారి పోయాయి. ముల్లుగర్రతో పొడిస్తే కదిలే దున్నపోతులు లేవు. అన్నీ ఖడ్గ మృగాలే. పదునైన కత్తితో కసుక్కున పొడిచినా కత్తి వంగిపోతున్నదే తప్ప, చర్మం మీద చీమ కుట్టిన స్పందన వుండడం లేదు. రాజకీయవాదులు కానీ, ఇతర వృత్తులలో వుండేవారు కానీ... అందరి తీరూ అంతే. పాత రోజులలో రాజకీయవాదు లైనా, కలెక్టర్ వంటి అధికారులైనా పత్రికలలో వార్తలొచ్చినా, వ్యాఖ్య చేసినా ఉలిక్కిపడేవారు. తప్పు సరిద్దుకోవడానికి చూసేవారు. ఇప్పుడా స్పందన ఒక్కరిలోనూ లేదు. ముఖాన ఉమ్మినా తుడుచుకొని, తమ పని తాము చేసుక పోతు న్నారు. ఈ వాతావరణంలో సణగడం, గొణగడం ఎందుకు, దండగ అనే నిస్పృహతో ఈ శీర్షికకు పాతర వేయక తప్పలేదు. కానీ నా సణుగుడు కంటే, అది లేదని పాఠకులు చేసే గొణుగుడు ఎక్కువ కావడంతో మళ్లీ మొదలు పెడుతున్నాను.

***

వెనుకటి రోజులలో నెల్లూరు నగరమంటే నాగరికతకు పర్యాయపదం. రాష్ట్రంలో ఏ ప్రాం తానికి వెళ్లినా నెల్లూరు నుంచి వచ్చినవారి పట్ల ప్రత్యేక గౌరవం. మద్రాసులో కూడా నెల్లూరు వాళ్లకు విశిష్ట గుర్తింపు. నెల్లూరీయుల జీవనశైలి మీద మద్రాసు ముద్ర స్పష్టంగా కన్పించేది. మార్కెట్లో కొత్తగా వచ్చిన ఫ్యాషన్ దుస్తులు, సెంట్లు, పౌడర్లు పక్కరోజే నెల్లూరులో ప్రత్యక్షమ య్యేవి. మనుషులు నాజూకుగా వుండేవారు. భావ నలు సున్నితంగా వుండేవి. కవులు, కళాకారులు, రచయితలు, డాక్టర్లు, న్యాయవాదులు, సమాజ సేవకులు, పత్రికా సంపాదకులు, విద్యావంతులు... వీరందరి వెనుక రాజకీయవాదులు వినయంగా మసలుకొనే వారు. వీధి రౌడీగా పేరుపొందిన ఎసి సుబ్బారెడ్డి కూడా వి.ఆర్ కాలేజీకి వస్తే, అయ్యవార్ల ముందు బుద్ధిమంతుడైన పిల్లవాడి వలె మెలిగే వాడట. ఆయన రౌడీ చేష్టలు కటారిపాళెం, కపాడి పాళెంలకు మాత్రమే పరిమితం. తతిమా టౌన్లో బుద్ధిగా మసలుకొనేవాడు. జిల్లాకు వచ్చే కలెక్టర్లు, ఇతర అధికారులు ఎంతో స్వేచ్ఛగా పని చేసే వారు. మలయప్పన్, ఎస్ఆర్.శంకరన్ వంటి కలె క్టర్లు విశ్వవ్యాప్త ఖ్యాతి సాధించింది ఇక్కడే అన్న విషయం మర్చిపోకూడదు. రెవిన్యూ, పోలీసు యంత్రాంగాలు నిక్కచ్చిగా పని చేసేవి. న్యాయ వాదులకు సమాజంలో ఎక్కడలేని గౌరవం. వేల ఎకరాల భూస్వాములు సైతం బక్కచిక్కిన బాపన వకీళ్ల ముందు వినయంగా మెలిగేవారు. పౌర జీవనం హాయిగా నడిచేది. అందుకే ఇతర జిల్లాల నుంచి వచ్చి ఇక్కడ పని చేసిన అధికారులు, రిటైర్ మెంట్ తర్వాత ఇక్కడే స్థిరపడిపోయేవారు. ఎమ్మె

**డోలేంద్ర**

ల్యేలుగా, సమితి అధ్యక్షులుగా, జిల్లా బోర్డు సభ్యు లుగా, మునిసిపల్ ఛైర్మన్లుగా ఎన్నికయ్యే రాజకీయ వాదులు సమాజ సేవకు ప్రాధాన్యత ఇచ్చేవారు. పరువు ప్రతిష్టల కోసం ప్రాకులాడే వారు. ఆ క్రమంలో తమ ఆస్తులు కోల్పోయేవారు. వెంకటా చలం సమితి అధ్యక్షుడిగా పని చేసిన రామిరెడ్డి దశరథరామిరెడ్డి రాజకీయాలలోకి రాక ముందు పెద్ద భూస్వామి. కానీ చివరి రోజులలో రిక్షా ఎక్కడానికి జేబులో డబ్బు లేక ఎంత దూరమైనా నడిచి తిరిగేవాడు. పేదరికం నుంచి ప్రజా జీవితం లోకి వచ్చిన ఒరేపల్లి వెంకట సుబ్బయ్య ఎమ్మెల్యేగా, జిల్లా పరిషత్ ఛైర్మన్గా పనిచేసినా, పేదరికంతోనే గతించాడు. ఆనాటి రాజకీయవాదులలో ఇటు వంటి ఆదర్శప్రాయుల గురించి చెప్పాలంటే లెక్కలే నన్ని ఉదాహరణలున్నాయి.

అవి సత్తెకాలపు రోజులు. ఇప్పుడు నెల్లూరు పేరు చెప్తే రాష్ట్రంలో ఎక్కడికి పోయినా ఎగతాళి. విదూషకులను మరపించే ఎమ్మెల్యేలు, కార్పొరేటర్ పదవితోనే కోట్లు కొల్లగొట్టే వికృత రాజకీయ సం స్కృతి, వేశ్యా ప్రవృత్తి కల్గినవారిని పట్టపురాణులుగా అందలం ఎక్కించే నీచ రాజకీయ పోకడ, అధికా రంలో వున్న వారి ఇళ్ల దగ్గర కావలి కుక్కల వలె పని చేసే పోలీసు యంత్రాంగం, అధికారులను తమ బానిసలుగా చూసే హీన తత్వం... ఇవే ఇప్పటి నెల్లూరు గొప్పదనాలు. ఈ వాతావరణాన్ని అడ్డు పెట్టుకొని కొత్త కొత్త విష పురుగులు జనం మధ్యకు వస్తున్నాయి. జనం మీద విషం చిలక రిస్తున్నాయి.

ఇందుకొక ఉదాహరణ – నగరమంతా ముళ్ల పొద వలె ప్రాకుతున్న లీగల్ మాఫియా. టెక్కేమిట్టకు ఎదురు, శాంతినగర్లో ఒక న్యాయ వాది ఇల్లు ఈ మాఫియాకు కేంద్ర స్థానం. ఆయన కోర్టుకు పోడు. ఏ కేసు స్వయంగా వాదించడు. కానీ న్యాయవృత్తిని, న్యాయస్థానాలను అడ్డు పెట్టు కొని సకల సబ్బండు అరాచక కృత్యాలను నడిపిస్తూ వుంటాడు. నెల్లూరు నగరం సరిహద్దులలో ఎక్కడ భూ ఆక్రమణ జరిగినా ఆయన ప్రమేయం కన్పిస్తు న్నది. హత్యలు చేసిన నేరస్తులు బెయిల్ దొరికే వరకు ఆయన ఇంట్లో కుషీగా కాలం గడుపుతుం టారు. సిపిఎం, సిపిఐ, కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్, బిజెపి వంటి పార్టీల నేతలందరితో ఆయనకు దగ్గరి సంబంధాలు. నగరంలోని ప్రతి పోలీసుస్టేషన్ అడ్డా క్రిందే లెక్క. యూనిఫాం వేసుకొన్న పోలీసు అధికా రులు ప్రొద్దున్నే ఆయన ఇంట్లో దర్శనమిస్తూ వుం టారు. ఆ రోజు జరిగే నేరాలకు, ఘోరాలకు తమ వత్తాసు ఎంత అవసరమో, దాని ప్రతిఫలంలో తమ వాటా ఎంతో లెక్కలు చూసుకొని వెళ్తుంటారు. నగరం లోని అల్లరి చిల్లరి రౌడీ మూకలన్నీ ఆయన ఆశ్ర యంలోనే వున్నా యిప్పుడు. మాట వినని వాడి మీదకు వారిని ఎగ దోలుతూ వుంటాడు. నెత్తుటితో తడిసిన అక్రమ సొత్తును రాజకీయవాదులకు, పోలీ సులకు పంచి పెట్టడంలో ఘనాపాటి. ఆయన ఇల్లు క్రైం సినిమాలలో విలన్ అడ్డాలను తలపిస్తుంది. ఏ సమయంలో చూసినా ఏదో ఒక రౌడీ పంచాయితీ నడుస్తూ వుంటుందక్కడ.

తాజాగా కడప రౌడీలను నెల్లూరుకు దింపాడు ఈ మహాశయుడు. డబ్బు తీసుకొని కిరాతకంగా గొంతులు కోసే గూండా ముఠా ఒకటి ఈయన పోష ణలో వున్నట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. వారిని ప్రయోగించి, ఖరీదైన ఇళ్ల స్థలాలను ఆక్రమించి, అసలు యజమానులను బెదిరించి, బలవంతపు మధ్య స్థాలతో కబ్జా చేస్తున్నారు. ఇందుకు చాలా ఉదాహర ణలే విన్పిస్తున్నాయి. వాటిని వింటుంటే మనం నెల్లూ రులో వున్నామా లేక ఏ అరణ్యంలోనో నివశిస్తు న్నామా అన్న భయం కల్గుతున్నది.

శ్రీనివాసరెడ్డి ఎస్పీగా వున్నప్పుడు ఈ న్యాయ వాది అరాచకాలకు అడ్డుకట్ట వేసే ప్రయత్నం చేశాడు. ఆయన చేసే దుర్మార్గాలను ఆరా తీసి, బొక్కలో తోయ డానికి రంగం సిద్ధం చేశాడు. క్రిందిస్థాయి పోలీసు లతో నిత్య సంబంధాలుండడంతో ముందుగానే ప్రమాదాన్ని వూహించి, శ్రీనివాసరెడ్డి బదలీ మీద వెళ్లే వరకు రహస్య జీవితం గడిపి, తప్పించుకొన్నాడు. లేకుంటే అప్పుడే వూచలు లెక్క పెట్టి వుండేవాడు.

ఇప్పటి ఎస్పీ రమణ కుమార్ గారు ఈ మాఫియా సామ్రాజ్యం మీద ఒక కన్నేయడం చాలా అవసరం. లేకుంటే ఈ విషపు పురుగు ధాటికి నగరంలో అరాచకం తాండవిస్తుంది. ఏదైనా మొక్కగా వున్నప్పుడు వంచితేనే ఫలితం. మానైన తర్వాత చేయగల్గింది ఏదీ వుండదు. ఈ న్యాయవాది దూకుడుకు అడ్డుకట్ట వేయకుంటే – అతడొక "నెల్లూరు భాను"గా మారిపోయే ప్రమాదం వుంది. జాగ్రత్త?

# మయసభను మరిపించే పార్క్‌హయత్

మహా భారత గాధలోని మయసభ రూపం ఎట్లా వుంటుందో చూడాల న్పిస్తే, నేరుగా పార్క్ హయత్ హోటల్కు వెళ్లిపో వచ్చు. దాన్ని చూస్తే కళ్లు తిప్పుకోలేము. మనబోటి సామాన్యులకే కాదు, అలనాటి విశ్వకర్మ కూడా నివ్ దాశ్చర్యంతో విస్తుపోవడం ఖాయం – తన వాస్తు శిల్పకళ ఎంత వెనుకబడి వుందో... అని! తిక్కవరపు సుబ్బరామిరెడ్డి గారి కలల ప్రపంచం అది. 50 ఏళ్ల క్రితం, 1962 మార్చి నెలలో ఆయన తన వ్యాపార జీవితం ప్రారంభించారు. ఇన్నినాళ్ల స్వేదానికి గుర్తుగా ఒక అద్భుతమైన నిర్మాణం చేయాలనే తపన ఆయ నలో చాన్నాళ్ల నుంచే వుంది. ఆ నిరీక్షణ సరిగ్గా మార్చి నెలలోనే ఫలించింది. దానికి ప్రత్యక్ష రూపం – ఈ త్రిభువన మోహన భవనం. పురాణాలలోని ఇంద్ర భవనమంత అందంగా, ఆధునిక తాజ్ మహ ల్‌ను తలపించేంత సుందరంగా, రాచమందిరా లంత మనోహరంగా తీర్చి దిద్దారు దీన్ని. ఖర్చు అక్ష రాల ఐదు వందల కోట్ల రూపాయలు. స్థాయి – ఏడు నక్షత్రాలు. హైదరాబాదులో ఈ స్థాయిలో నిర్మితమైన తొలి హోటల్ ఇదే. తతిమావన్నీ దీని ముందు దిగదుడుపే. 185 మామూలు గదులు, 24 విశాలమైన సూట్లు, 42 సర్వీస్ అపార్టుమెంట్లు ఇం దులో ఇమిడి వున్నాయి. మూడు ముచ్చటైన రెస్టారెం ట్లలో ఇటాలియన్, జపాన్, భారతీయ వంటకాలు లభిస్తాయి. హోటల్లోకి అడుగు పెట్టగానే పసి బిడ్డను అక్కున చేర్చుకొన్న కన్నతల్లి పాలరాతి విగ్రహం ముగ్ధమనోహరంగా కన్పిస్తుంది. అక్కడ నుంచి ప్రతి అడుగులోనూ విస్మయం తప్ప మరొక భావన కల గదు. మధురై గ్రానైట్ పలకల వర్ణ శోభితం, నడువా పక్కన కనువిందు చేసే పచ్చిక బయళ్లు, కాంతిపుం జాలు వెదజల్లే చెకొస్లొవేకియా షాండ్లియర్లు, చూపు తిప్పుకోలేని అద్భుత ఫ్రెంచ్ చిత్రకారుడి చిత్ర పటాలు... ఎంత చెప్పినా తక్కువే. విలాసాలు కోరు కొనే వారికి కావాల్సిన వసతులన్నీ వున్నాయి. గదుల



సౌందర్యం, సౌకర్యం చూడాల్సిందే తప్ప వర్ణించడం కష్టం. మనబోటి వాళ్లం దాన్ని చూడడమే తప్ప అందులో భోగం అనుభవించాలనుకోవడం అత్యాస అవుతుంది. మామూలు గదికి ఒక రాత్రికి 15వేల రూపాయలు. అదే విశాలమైన సూట్ అయితే అదే రాత్రికి లక్ష రూపాయలు. రెస్టారెంట్కు వెళ్లి విందార గించాలంటే ఒక మనిషికి కనీసం ఐదు వేల వరకు చేతి చిలుము వదలుతుంది. ఏ కూర ధర చూసినా కనీసం వెయ్యి రూపాయలు.

హోటల్ స్థాయికి తగినట్లే దాని ప్రారంభ మహోత్సవాన్ని కూడా ఘనంగా జరిపించాడు సుబ్బ రామిరెడ్డి గారు. గులాం నబి అజాద్, కమలనాథ్ తదితర కేంద్ర మంత్రులు 8 మంది, రాష్ట్రమంత్రులు దాదాపు డజను మంది, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి, హిందీ సినీ తారలు, తెలుగు కథానాయకులు, కథానాయికలు, పారిశ్రామిక దిగ్గజాలు, ఉన్నత అధి కారులు... వారూ వీరనేమిటి... సమాజంలో పై స్థాయిలో వున్న వారంతా కదలి వచ్చారు ఈ మయ సభను చూసి తరించడానికి. సుబ్బరామిరెడ్డి తన యుడు సందీప్‌రెడ్డి, జివికె కుమారుడు సంజయ్‌రెడ్డి, వారి కుటుంబ సభ్యులు పింకి రెడ్డి, సరితారెడ్డి, ఇం దిరారెడ్డి తదితరులంతా ఆహూతులను ఆదరంతో స్వాగతించారు.

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు

# ఆపద్బాంధవుడు నృసింహస్వామి!



వైశాఖ మాసంలో వచ్చే ముఖ్యమైన పండుగలలో శ్రీ నృసింహ జయంతి ప్రసిద్ధమైనది. ఈ మాసంలో వచ్చే చతుర్దశిని నృసింహస్వామి జయంతిగా జరుపుకోవడం ఆనవాయితీ. హిందూ పురాణాల ప్రకారం త్రిమూర్తులలో ఒకడైన విష్ణువు లోకపాలకుడు. సాధు పరిరక్షణ, దుష్టశిక్షణ కోసం ఎన్నో అవతారాలతో యుగయుగాన అవతరిస్తాడు. వాటిలో ముఖ్యమైన పది అవతారాలను దశావతారాలు అంటారు. వీటిలో నాలుగవ అవతారమే నృసింహావతారం. మహాలక్ష్మిని సంబోధించే శ్రీ పదాన్ని చేర్చి శ్రీనారసింహుడని అవతారమూర్తిని స్మరిస్తారు. విష్ణుమూర్తి ఎత్తిన ప్రతి అవతారానికి ఒక విశిష్టత ఉంది. ఈ నృసింహావతారంలోనూ కొన్ని ప్రత్యేకతలున్నాయి. భగవంతుడు సర్వాంతర్యామి అన్నది స్పష్టంగా ఈ అవతారంలో తెలుపబడుతుంది. అలాగే సగం మనిషి, సగం మృగ ఆకారం ఈ నృసింహ అవతారంలోనే మనకు కన్పిస్తుంది.




షుగర్ వ్యాధిగ్రస్తులకు సంజీవని జెరిటిన్-డి

నృసింహ అవతారానికి సంబంధించిన ఒక గాథ పురాణాలలో చెప్పబడుతుంది. జయ విజయులు వైకుంఠంలో ద్వారపాలకులు, విష్ణు సేవాతత్పరులు. ఒకనాడు సనక సనందనాది మునులు నారాయణుని దర్శనం కోసం వైకుంఠానికి రాగా అది అందుకు తగిన సమయం కాదని ద్వారపాలకులైన జయవిజయులు వారిని అడ్డగిస్తారు. అందుకు మునులు కోపించి విష్ణు లోకానికి దూరమవుతారని శపిస్తారు. అప్పుడు వారు శ్రీమహావిష్ణువును శరణువేడగా ఆయన వారిని ఏడు జన్మలు భక్తులుగా, మూడు జన్మలు విరోధులుగా భూలోకాన జన్మించి ఆ తర్వాత వైకుంఠానికి రమ్మంటాడు. వారే కృతయుగంలో హిరణ్యాక్ష, హిరణ్యకశపులుగా, త్రేతాయుగంలో రావణ, కుంభకర్ణులుగాను, ద్వాపరయుగంలో శిశుపాల, దంతావక్రులుగాను జన్మించారు. ప్రతి జన్మలో మహావిష్ణువు అవతారం చేత వధులై అనంతరం శాపవిముక్తి పొందారు.

నృసింహావతారానికి మరో విశిష్టత ఉంది. శ్రీరామ, శ్రీకృష్ణ, వామన, పరశురామాది అవతారాలలో ధర్మ సంరక్షణార్థం భగవంతుడు తల్లి తండ్రులకు వరపుత్రుడై అవతరించాడు. నృసింహ స్వామి మాత్రం ప్రహ్లాదునికి సంభవించిన విపత్తుకు కాలయాపన చేయకుండా స్తంభం నుండి అప్పటికప్పుడే ఉద్భవించిన అవతారమూర్తి. ఆపదలో చిక్కుకున్న భక్తులకు తక్షణమే సహాయం అందించగల ఏకైక దయామూర్తియైన అవతారం ఇది. నృసింహ అవతారంలో స్వామి భయంకరమైన రూపంతో ప్రళయాగ్నిహోత్రుని వలె కన్పించినా, నిజానికి హృదయంలో నుంచి పొంగి వచ్చే అనంత దయగల ఉపాసనా అనుగ్రహ స్వామి. అలాంటి నృసింహస్వామిని జగన్మాత లక్ష్మీదేవి చందనం పూసి శాంతపరచిందట. ఉగ్ర నరసింహుని... లక్ష్మీనరసింహునిగా మార్చిన శీతల చందనాన్ని స్వామి వారికి పట్టించేదే చందనోత్సవం.



# వారఫలాలు

తేది 5-05-2012 నుండి 11-05-2012 వరకు మేషంలో రవి, బుధ, గురువులు; వృషభంలో శుక్ర కేతువులు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; తుల, వృశ్చిక, ధనుర్మకరాలలో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం** అశ్వని, భరణి, కృత్తిక 1 పా

చేసే పనులపై శ్రద్ధ పెట్టాలి. ఇతరులతో మాట్లాడేటప్పుడు జాగ్రత్తలు పాటించేది. కుటుంబ సభ్యులతో వివాదాలు ఏర్పడవచ్చు. కానీ ఆర్థికంగా మెరుగ్గానే వుంటుంది. ఉద్యోగస్తులు పై అధికారుల వల్ల మనస్తాపానికి గురౌతారు. విద్యార్థులు ఇబ్బందులెదుర్కోవలసి వస్తుంది. రాజకీయ రంగంలోని వారికి అనుకూలమైన సమయం. సన్నిహితులు సహాయపడతారు.



**వృషభం** కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

గతంలో కంటే మెరుగ్గా వుంటుంది. మానసిక ఉత్సాహం కలిగి, ఆర్థికంగా బలపడతారు. కుటుంబ సభ్యులతో కలసి శుభకార్యాలలో పాల్గొనుట, స్నేహితులు, సన్నిహితులను కలుసుకొనుట జరుగుతుంది. ఉద్యోగులకు స్థానచలన సూచనలున్నాయి. విద్యార్థులు ఉత్సాహంగా వుంటూ తమ పనులు పూర్తి చేసుకొంటారు. వ్యవసాయ రంగంలోని వారికి సమయానికి డబ్బు అందుతుంది.



**మిథునం** మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

తలపెట్టిన పనులలో ఆటంకాలెదురయ్యి కొన్ని వాయిదా పడతాయి. భూసంబంధమైన కొనుగోలు ప్రక్రియలో పాల్గొంటారు. ఆకస్మిక ప్రయాణాలు, బంధుమిత్రులతో అభిప్రాయభేదాలు రావచ్చు. విద్యార్థులు తమ ఉన్నతవిద్యలకై వేసే అంచనాలు తప్పవచ్చు. వ్యవసాయ రంగంలోని వారికి సామాన్య ఆదాయం. కళా, క్రీడా రంగాలలోని వారికి మాటపట్టింపులు, రాజకీయాలలోని వారికి నిరాశ తప్పదు.



**కర్కాటకం** పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

ఈ రాశి వారికి గతం కంటే మేలనిపిస్తుంది. వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలోని వారు తమ పనులకై అధికారులను కలుస్తారు. ఆర్థికంగా బాగుంటుంది. చిరకాల ప్రత్యర్థులు మిత్రులుగా మారుతారు. నూతనోత్సాహంతో తమ ఆలోచనలు అమలుపరచి లాభాన్ని పొందగలరు. విద్యార్థుల తమ ఉన్నతికై చేసే కృషి ఫలిస్తుంది. వ్యసాయ రంగంలోని వారికి ఆర్థిక పుష్టి వుంటుంది.



**సింహం** మఖ, పుబ్బ ఉత్తర 1 పా

వృత్తి, వ్యాపార రంగాలలోని వారు బుద్ధిబలంతో తమ ఇబ్బందులను ఎదుర్కొంటారు. విందులు, వినోదాలలో పాల్గొంటారు. విద్యార్థులు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగస్తులకు పదోన్నతులు లభిస్తాయి. వ్యవసాయ రంగంలోని వారు ఉత్సాహంగా వుంటారు. కళా, క్రీడా రంగాలలోని వారు నిందలు పడాల్సి వస్తుంది. రాజకీయ నాయకులు ప్రజలతో సాన్నిహిత్యాన్ని పెంపొందించుకొంటారు.



**కన్య** ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

పనులు సక్రమంగా పూర్తిచేస్తారు. ఆర్థికపుష్టి, ఆరోగ్యంతో ఉత్సాహంగా వుంటారు. నిరుద్యోగులు ఉద్యోగాలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగులకు ప్రమోషన్లు లభిస్తాయి. విద్యార్థులు విజయాలు సాధిస్తారు. వ్యవసాయం చేసే వారి ఆర్థికస్థితి సామాన్యం. క్రీడా రంగంలోనివారు పైవారి నుండి మాటలు పడవలసి రావచ్చు. రాజకీయ నాయకులకు సన్నిహితులతో భేదాభిప్రాయాలు రావచ్చు.



**తుల** చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

అన్ని పనులు పూర్తయి, ఆర్థిక విషయాలలో పురోగతి కనిపిస్తుంది. భూ, గృహాది కొనుగోలు ప్రయత్నాలు లాభిస్తాయి. ముఖ్యమైన పనులకై ఉన్నతాధికారులను కలుసుకోవడం జరుగుతుంది. ఇంటా, బయట మీ మీద గౌరవాభిమానాలు పెరుగుతాయి. వ్యవసాయ రంగంలోని వారికి అధికశ్రమ, వృథా ఖర్చులు. కళా, క్రీడా రంగాలలోని వారికి వృథా ప్రయాణాలు, మానసిక ఒత్తిడి వుంటుంది.



**వృశ్చికం** విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

తలపెట్టిన పనులన్నీ పూర్తవడంతో నూతనోత్సాహంతో కొత్త పనులు చేపడతారు. అందరిలోనూ గుర్తింపు లభిస్తుంది. విద్యార్థులు ఉన్నత విద్యకై చేసే ప్రణాళికలు ఫలిస్తాయి. వ్యవసాయం చేసేవారికి అధిక శ్రమ, మనస్తాపం వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి ఇతరులతో అకారణ కలహాలుంటాయి. రాజకీయాలలోని వారు ఇబ్బందులతోపాటు నిందలు కూడా ఎదుర్కోవాల్సి వస్తుంది.



**ధనుస్సు** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

పనులు పూర్తికాక నిరాసక్తి కలుగుతుంది. ఆర్థికంగా సామాన్యంగా వుంటుంది. వ్యాపార రంగంలోని వారికి తోటి వ్యాపారులతో అభిప్రాయభేదాలు, మిత్రులు ప్రత్యర్థులుగా మారుట జరుగుతుంది. సంతానానికి సంబంధించి శుభవార్తలు వింటారు. కళా,క్రీడా రంగాలలోని వారికి పనులు వాయిదా పడతాయి. రాజకీయ రంగంలోని వారికి చిరకాల ప్రత్యర్థులు మిత్రులుగా మారడం జరుగుతుంది.



**మకరం** ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

అతి కష్టం మీద పనులు పూర్తిచేస్తారు. కొత్త రుణాలు చేయుట, బంధుమిత్రులతో మాట పట్టింపులు ఏర్పడుట వుంటుంది. ఉద్యోగులకు మార్పులు, వృత్తి, వ్యాపార రంగాలలోని వారికి లావాదేవీలలో నిరాశ కలిగిస్తాయి. విద్యార్థులకు అనుకూలించినా అధిక శ్రమ తప్పదు. నిరుద్యోగుల ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యవసాయ రంగంలోని వారికి లాభదాయకంగా వుంటుంది.



**కుంభం** ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

నూతన వస్తు, వాహన సామగ్రిని సమకూర్చుకొంటారు. వృత్తి, వ్యాపారుల లావాదేవీలు లాభిస్తాయి. విద్యార్థులు అధిక శ్రమతో తమ పనులు సాధించుకొంటారు. వ్యవసాయ రంగంలోని వారు తమ పనులు ఉత్సాహంతో పూర్తి చేస్తారు. కళా, క్రీడా రంగాలలోని వారికి గుర్తింపు, ఆర్థికస్థితి మనస్సుకు సంతోషాన్నిస్తుంది. రాజకీయ నాయకుల ఆలోచనలు ఫలిస్తాయి. శ్రమకు తగ్గ ఫలితం వుంటుంది.



**మీనం** పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

తలపెట్టిన పనులన్నీ స్వల్ప మార్పులతో పూర్తిచేస్తారు. మీ మంచితనం వల్ల గౌరవాభిమానాలు పొందగలరు. వ్యాపారస్తులకు అనుకూలమైన వారం. వ్యవసాయం చేసేవారికి ధన లాభం, మనోల్లాసం కలుగుతుంది. విద్యార్థులు తమ ఉన్నత విద్యకు చేసే ప్రయత్నాలు ఆలస్యమవడంతో అనవసర ఆందోళనకు గురౌతారు. రాజకీయులకు అధికశ్రమ, అకారణ ఆందోళనలుంటాయి.

## పంచాంగం

5తేది శ్రీ నృసింహ జయంతి, శ్రీకూర్మ జయంతి.
6తేది మహా వైశాఖి – బుద్ధపూర్ణిమ, సంపదగౌరీ వ్రతం.
11తేది నిజ కర్తరి ప్రారంభం.

**శుభ ముహూర్తాలు**

ఏప్రెల్ 30తేది నుండి గురుమౌఢమి జరుగుతున్నందువల్ల వివాహాది శుభకార్యాలకు సుముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసన వంటి సాధారణ శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

**మే తిథులు**

**వైశాఖ శుద్ధ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5 | శని | చతుర్దశి | ప | 12.51 | గం.ల.వ |
| 6 | ఆది | పౌర్ణమి | ప | 09.03 | గం.ల.వ |

**వైశాఖ బహుళ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| | తదుపరి | పాడ్యమి | తె | 05.16 | గం.ల.వ |
| 7 | సోమ | విదియ | రా | 01.41 | గం.ల.వ |
| 8 | మంగళ | తదియ | రా | 10.26 | గం.ల.వ |
| 9 | బుధ | చవితి | సా | 07.40 | గం.ల.వ |
| 10 | గురు | పంచమి | సా | 05.31 | గం.ల.వ |
| 11 | శుక్ర | షష్ఠి | సా | 04.03 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్లసుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.

# వృక్ష పూజతో వ్యాధి నిర్మూలనం!

*వి.రాజేంద్రకుమార్ నెల్లూరు*

* *నేను గత పాతిక సంవత్సరాలుగా అనారోగ్యంతో బాధపడుతున్నాను. విరుగుడైమేనా చెప్పగలరా?*

కశ్యప, మాండవ్య శాస్త్రాలలో మనిషికి వృక్షాలకు కార్యకారణ సంబంధం ఉన్నట్లు చెప్పబడింది. మీది ధనిష్ఠ నక్షత్రం. మీకు దేవవృక్షం శమీ(జమ్మి). మీరు మండలం రోజులు వృక్ష ప్రదక్షిణ చేసి ఆయుర్వేద వైద్యుల సలహాతో బెరడు కషాయం తీసుకోండి. వ్యాధి నిర్మూలనం జరుగుతుంది.

*వి.ఏసుపాదం బండాత్మకూరు*

* *గృహాన్ని అమ్మవలసి వస్తే దోషాలు యజమానికి అంటకుండా ఏమేమి చేయాలి?*

గృహదోషాల్ని సవరించి, అథవా యంత్ర ప్రతిష్ట చేసి అమ్మడం వల్ల అవాస్తుదోషాలు యజమానికి అంటవు.

*పి.కె.ఎస్ కర్నూలు*

* *యాచన సొమ్ముతో పూజాధికాలు నిర్వర్తించవచ్చునా?*

మీలోని స్వచ్ఛత, భక్తి ఇలాంటి అభిప్రాయాన్ని కలిగిస్తోంది. ఆగమశాస్త్ర విహిత 'ప్రాతః శిక్షలో అలా చేయవచ్చని ఉన్నది.

*కె.ప్రవీణ్‌కుమారి చెన్నై*

* *నేను శ్వాసకోశ, చర్మవ్యాధులు కలిగి ఉన్నాను. కానుగ విత్తుల రసాన్ని తాగమన్నారు. మీ సలహా చెప్పండి.*

మీది జ్యేష్ఠ నక్షత్రం, వృక్షదేవత కానుగ. అందువల్లే వృక్షప్రదక్షిణ, విత్తుల నూనె చర్మానికి పూయడం, విత్తుల కషాయం తీసుకోవడం చేయాలి. వైద్యుల పర్యవేక్షణ అవసరం.

*ఎం.విశ్వనాథశాస్త్రి హైదరాబాద్*

* *మనిషి జీవితం సుఖవంతం కావడానికి వృక్షపూజకు సంబంధం ఏమిటి?*

జన్మరాశి, నక్షత్రాలనుబట్టి మానవులకు వృక్షాలను సూచించారు ప్రాచీన శాస్త్రజ్ఞులు. అలా వృక్షపూజ చేయడం వల్ల వనదేవతలు ఆశీర్వదిస్తారని విశ్వామిత్రవాస్తు చెబుతున్నది.

*కె.సరోజ చెన్నై*

* *నూతన గృహ ప్రవేశం చేశాము. శాంతులు, పద్ధతులేవైనా ఉన్నాయా?*

కొత్త, పాత గృహాల్లో చేరేటప్పుడు భార్యాభర్తలకు, ఇంటి దిక్కుకు అనువైన యంత్రాన్ని గణింపజేసి ప్రతిష్టించుకోవాలి.

*చమన్ షేక్ సికింద్రాబాద్*

* *ప్లాటులో అన్నీ దోషాలుగానే కనిపిస్తున్నాయి. సమస్య పరిష్కారం ఎట్లాగ?*

గృహంలో చేరాక మండలం(నలభై) రోజుల తర్వాత దోష ప్రభావాలు ప్రారంభమవుతాయి. అప్పుడు వాస్తు దోషాల్ని సరిచేసుకుని నిర్ణీత యంత్ర ప్రతిష్ట చేసుకుంటే సరిపోతుంది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*షేక్ అబ్దుల్లా పర్వీన్ హైదరాబాద్*

* *దక్షిణం పల్లం. పశ్చిమం సరైన రహదారిలేదు. ఇపుడేం చేయగలం?*

వాస్తు ప్రకారం సరిచేసుకోవడమే సరైన మార్గం. మరీ చేయలేని పరిస్థితిలో దిక్కు, యజమాని నక్షత్రం గణించగా వచ్చే యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

*కె.వి.అమర బుజబుజనెల్లూరు*

* *పట్టణం దాటాక ఇళ్ల స్థలం కొని నిర్మాణం చేస్తే ఏదో భయంగా ఉంటోంది?*

మీ అభిప్రాయం అర్థమయింది. ఊరి శివార్లలో దుష్టశక్తి ఆవాహనలుండవచ్చు. యంత్రాన్ని సంప్రోక్షణ చేసి దేవుడి గదిలో ప్రతిష్టించుకోండి.

*ఎన్.విలియమ్స్ నెల్లూరు*

* *ఇంటికి గుమ్మడి దిష్టి తీయడం మంచిదేనా?*

గృహంలో కార్యక్రమాలు జరిగే సందర్భాల్లో అట్లా చేయవచ్చు. "ఇదం బలి నివేధయామి" "వాస్తు పురుషాయ నమః" అనే శబ్ద పఠన మేలు చేస్తుందని 'వాస్తుపాఠం' చెబుతోంది.

*ఎ.వసుంధరానాయుడు పెనుగొండ*

* *ప్రధాన ద్వారం కంటే రెండు ద్వారాలు పెద్దవిగా ఉన్నాయి.*

ప్రధాన ద్వారమే పెద్దదిగా ఉండాలి. ద్వార దోష నివారణ కోసం సిద్ధాంతి నిర్ధారించిన యంత్ర ప్రతిష్ట చేసుకోండి.

# గోతాలు, గోడౌన్ల కొరతతో అల్లాడుతున్న రైతులు!



రోడ్డుపైనే ధాన్యాన్ని ఎండ బెట్టుకొంటున్న రైతు సోదరులు.

సన్న చిన్నకారు రైతులను ఆదుకొనేందుకు ప్రభుత్వం ధాన్యం కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేసింది. జిల్లావ్యాప్తంగా ఏర్పాటు చేసిన ఈ కేంద్రాల ద్వారా రైతులకు మద్దతు ధర కల్పించడమే లక్ష్యం. అంతవరకు బాగానే వున్నా గోతాల కొరత పేరుతో ధాన్యాన్ని కొనుగోలు చేయకపోవడం, తేమ శాతమని పలురకాల కారణాలతో మిల్లర్లు, దళారులు తక్కువ ధరకు కొనుగోలు చేయడంతో రైతులకు ఎలాంటి ప్రయోజనము చేకూరడం లేదు. మరోవైపు గోడౌన్ల కొరత పట్టి పీడిస్తుంది. గిట్టుబాటు ధర సంగతి దేముడెరుగు దళారులు అడిగిన ధరకు తెగనమ్ముకోవాల్సిన పరిస్థితులు ఏర్పడడంతో రైతులు అన్ని విధాలా నష్టపోతున్నారు.

జిల్లావ్యాప్తంగా రైతులు ఈ ఏడాది పెద్ద ఎత్తున వరి సాగు చేపట్టారు. వరికి మద్దతు ధర కల్పించేందుకు వందకుపైగా ధాన్యం కొనుగోలు కేంద్రాలను ప్రభుత్వం ఏర్పాటు చేసింది. 'ఏ' గ్రేడ్ రకానికి పుట్టి 9,435, సాధారణ రకం 9,180 రూపాయలు ధర నిర్ణయించింది. కేంద్రాలలో వివిధ సమస్యల కారణంగా చివరకు రైతులు దళారులను ఆశ్రయించాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. అధికారులు రికార్డు స్థాయిలో ధాన్యం కొనుగోలు చేశామని చెప్తున్నా రైతుల పరిస్థితి దయనీయంగా వుంది. గోతాల కొరత తీవ్రంగా వుంది. లక్షలాది గోతాలు పంపిణీ చేస్తున్నామని అధికారులు ప్రకటిస్తున్నా ఆచరణలో మాత్రం అందుకు విరుద్ధంగా వుంది. దళారులు ఎలాగైనా తక్కువ ధరకు ధాన్యాన్ని కొనుగోలు చేయాలని పథకం పన్ని ఆయా కేంద్రాల సిబ్బందితో కుమ్మక్కై రైతులకు అవసరమైన గోతాలు అందకుండా దళారులు చేజిక్కించుకొంటున్నట్లు సమాచారం. రైతులు మాత్రం గోతాల కొరత కారణంగా కళ్లాల్లోనే ధాన్యాన్ని మగ్గపెట్టుకోవాల్సి వస్తోంది.

ధాన్యం కొనుగోళ్లలో ప్రభుత్వం ప్రణాళికాబద్ధంగా వ్యవహరించకపోవడంతో గోడౌన్ల సమస్య రైతాంగానికి గుదిబండగా మారుతోంది. ఏటా ఈ సమస్య వలన ధాన్యం ధర తగ్గిపోతోందని రైతులు వాపోతున్నారు. ప్రైవేటు గోదాములకు అనుమతిస్తామని ప్రభుత్వం చెప్తున్నా, నాబార్డు నిధులతో గోడౌన్ల నిర్మాణానికి రుణాలు ఇచ్చేందుకు బ్యాంకులు ముందుకు వస్తున్నా తగిన ప్రణాళికలు లేకపోవడంతో అవి కార్యరూపం దాల్చడం లేదు. ఈ కారణంగా రైతులు పండించిన ధాన్యాన్ని తక్కువ ధరకే అమ్ముకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. జిల్లాలో ఏటా 15

> జిల్లాలో రైతుల నుంచి రికార్డు స్థాయిలో ధాన్యం కొనుగోలు చేశామని అధికారులు ప్రకటిస్తున్నా గోతాల కొరత తీవ్రంగా వేధిస్తుంది. ధాన్యం నిల్వచేసే గోదాములు కూడా లేకపోవడంతో దళారులు చెప్పిన ధరకే ధాన్యాన్ని అమ్ముకోవాల్సిన దుస్థితి నేడుంది.

లక్షల ఎకరాలలో వరి సాగు చేస్తున్నారు. భారత ఆహార సంస్థ 5.50 లక్షల టన్నుల బియ్యాన్ని లెవీగా తీసుకొంటుంది. ఎఫ్‌సిఐ, ఎస్‌డబ్ల్యుసి తదితర గోడౌన్లు ఈ నిల్వలకే సరిపోతుండడంతో రైతులు ధాన్యాన్ని నిల్వ చేసుకొనే వసతి లేక దళారులు చెప్పిన ధరకు అమ్ముకొని నష్టపోతున్నారు. దశాబ్ద కాలంగా ఈ సమస్యతో సతమతం అవుతున్నా వీటి నిర్మాణానికి తగిన చర్యలు చేపట్టక, మీనమేషాలు లెక్కిస్తుండడంతో రైతులు తీవ్రంగా నష్టపోతున్నారు. ఇప్పటికైనా రైతుల సంక్షేమాన్ని దృష్టిలో వుంచుకొని గోడౌన్ల నిర్మాణాన్ని త్వరితగతిన చేపట్టాలని రైతాంగం కోరుకొంటోంది.

**తేలని లెక్క**

# కుటుంబాలకు మించి తెల్ల రేషన్‌కార్డులు!

- **జన గణన ప్రకారం జిల్లాలో 7,72,825 కుటుంబాలున్నాయి.**
- **పౌరసరఫరాల శాఖ అధికారులు మాత్రం 8,09,702 మందికి తెల్ల రేషన్ కార్డులు జారీచేశామంటున్నారు.**
- **వీరు చెప్పే లెక్కల ప్రకారమే 36,247 తెల్ల రేషన్‌కార్డులు అదనంగా ఉన్నట్లు తేలింది.**




ఏ పనీ సరిగా చేయని నెల్లూరు పౌరసరఫరాల శాఖ కార్యాలయం.

జిల్లాలో బోగస్ రేషన్‌కార్డుల వ్యవహారం మరోమారు వెలుగుచూసింది. కుటుంబాలను మించి కార్డులు వున్నట్లు గతంలో అధికారులు జరిపిన సర్వేలో తేలినా దానిపై ఎలాంటి చర్యలు లేవు. అయితే ఇటీవల మద్యం బినామీలపై ఎసిబి అధికారులు జరుపుతున్న దాడుల్లో తెల్లకార్డుదారుల పేరిట మద్యం దుకాణాలను నిర్వహిస్తుండడంతో దానిపై సమగ్ర విచారణ జరుపుతున్నారు ఎసిబి అధికారులు. జిల్లాలో చేపట్టిన విచారణలో బోగస్ కార్డుల వ్యవహారం మరోసారి వెలుగు చూసింది. అర్హులకు దక్కకుండా ధనవంతులు తెల్లకార్డులను కలిగి వుండడంతో ప్రభుత్వం సబ్సిడీపై అందించే బియ్యం, కిరోసిన్, చక్కెర, కందిపప్పు తదితర నిత్యావసర వస్తువులు ప్రక్కదారిపట్టడంతోపాటు ఆరోగ్యశ్రీ కార్డు దుర్వినియోగం అవుతోంది.

ఇటీవల జనగణన చేపట్టిన అధికారులు చెప్పిన లెక్కల ప్రకారం 7,72,825 కుటుంబాలు వున్నాయి. పౌరసరఫరాల శాఖాధికారులు మాత్రం 8,09,702 మందికి వివిధ రేషన్ కార్డులను జారీ చేసినట్లు చెప్తుండడంతో వీటిలో 36,247 కార్డులు అదనంగా వున్నట్లు తేటతెల్లం అవుతోంది. వీటిలో అధికభాగం బోగస్ కార్డులుగా వున్నాయని సమాచారం. నిరుపేదలకు అందాల్సిన తెల్లరేషన్‌కార్డులను కొందరు రాజకీయనాయకులు, అధికారులు కుమ్మక్కై ధనవంతులు, బడాబాబులకు ఇష్టానుసారంగా ఇచ్చినట్లు తెలుస్తోంది.

జిల్లావ్యాప్తంగా గులాబీరంగు రేషన్‌కార్డులు 77,229, తెల్లకార్డుల సంఖ్య 6,74,730, అంత్యోదయ కార్డుల సంఖ్య 55,997, అన్నపూర్ణకార్డుల సంఖ్య 1,116 ఇవన్నీ కలిపితే 8లక్షలు దాటుతున్నాయి. వీటిలో దాదాపు 67వేలకు పైగా కార్డులు అనర్హుల చేతిలో వున్నట్లు సమాచారం. తెల్లకార్డులు, అంత్యోదయ, అన్నపూర్ణ కార్డులకు నెలకు 11వేల మెట్రిక్ టన్నుల బియ్యం, 16వేల లీటర్ల కిరోసిన్, 454 టన్నుల చక్కెర పంపిణీ చేస్తున్నట్లు అధికారులు చెప్తున్నారు. బోగస్ కార్డులు తెల్లకార్డులలో 10శాతానికి మించి వుండడంతో దాదాపు నెలకు వెయ్యి టన్నుల బియ్యం, లక్ష లీటర్లకుపైగా కిరోసిన్, చక్కెర, కందిపప్పు తదితర నిత్యావసర వస్తువులు ప్రక్కదారి పడుతున్నాయి. డబ్బులగలవారు, శ్రీమంతులు, అపార్టుమెంటులో నివసించేవాళ్లు, పెద్ద భవంతులుగల వాళ్లు తెల్లరేషన్ కార్డులను తీసుకొని వాటితో నిత్యావసర వస్తువులను తీసుకోకుండా ఆరోగ్యశ్రీ, ఫీజు రీఎంబర్స్‌మెంటు వంటి వాటికి వినియోగిస్తున్నారు. దీంతో పేదలకు ప్రభుత్వ సంక్షేమ ఫలాలు అందకుండా పోతున్నాయి. గతంలో సర్వే నిర్వహించి బోగస్ రేషన్ కార్డులను గుర్తించినా రద్దు చేయకపోవడంతో నిరుపేదలకు అందాల్సిన వాటిని పెద్దలు గద్దల్లా తన్నుకపోతున్నారు. వీటిని సరిదిద్ది అర్హులకు అందేలా అధికారులు ఎప్పుడు చర్యలు చేపడుతారో?

# యంగ్ హీరోలతోనే చేస్తా!



యంగ్ హీరోల ప్రక్కనే హీరోయిన్‌గా నటిస్తానని "బెజవాడ" ఫేం అమలాపాల్ చెప్పింది. ఏజ్‌బార్ హీరోల ప్రక్కన నేను బాగుండను. యంగ్ హీరోల సరసన నా నటన, రొమాన్స్ బాగుంటుందంది. ఈ విషయాన్ని మాటలే కాదు... చేతుల్లో కూడా చేసి చూపించింది. వెంకటేష్, మహేష్‌బాబు కాంబినేషన్‌లో రూపొందుతున్న 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు' సినిమా కోసం వెంకటేష్ సరసన అమలాపాల్‌ని హీరోయిన్‌గా తీసుకోవాలని దిల్‌రాజు చాలా ప్రయత్నాలు చేశాడు. భారీగా పారితోషికం ఇస్తానని దిల్‌రాజు చెప్పినా అమలాపాల్ ససేమిరా అన్న విషయం ఫిల్మ్‌నగర్‌లో బాగా చక్కర్లు కొడుతుంది.

## కండల పెంపకంలో అల్లరి నరేష్



హీరో అల్లరి నరేష్ చూడడానికి బక్కగా వుంటాడు. అతని ఆకారం కామెడీ హీరోగా అతడు నిలబడడానికి ఎంతో ఉపయోగపడింది. కాని సీరియస్ హీరోగా నిలదొక్కుకోవాలంటే మాత్రం అర్జెంట్‌గా తన అవతారాన్ని మార్చేయాలని భావిస్తున్నాడట అల్లరి నరేష్. ఇందుకోసం సిక్స్‌ప్యాక్ చేయాలని నిర్ణయించుకున్నాడట. కండలు పెంచితే యాక్షన్ హీరోగా నిలదొక్కుకోవచ్చని భావిస్తున్న నరేష్ ఇందుకోసం ఎంత కష్టపడటానికైనా సిద్ధపడుతున్నాడని తెలుస్తోంది. ఓ మంచి ట్రైనర్‌ను పెట్టుకొని త్వరలోనే వర్కవుట్లు మొదలుపెట్టడానికి ఏర్పాటు చేసుకొంటున్నాడు. తను హీరోగా రూపొందనున్న సోషియో ఫాంటసీ చిత్రంలో నరేష్ సిక్స్‌ప్యాక్‌తో కనువిందు చేయబోతున్నట్లు పరిశ్రమలో గుసగుసలు వినిపిస్తున్నాయి.



## రామ్‌చరణ్‌కు పెద్ద పారితోషికం!

రామ్‌చరణ్ హీరోగా ఎంట్రీ ఇస్తున్న బాలీవుడ్ చిత్రం 'జంజీర్'లో నటిస్తున్నందుకు గాను ఆయనకు 12 కోట్ల రూపాయలు పారితోషికంగా చెల్లించారట. ఈ చిత్రంలో హీరోయిన్ ప్రియాంకాచోప్రాకు తొమ్మిది కోట్ల రూపాయలు ఇచ్చారు. ప్రియాంక సీనియర్ హీరోయిన్ అయినా హీరో హీరోనే కదా అనేది జంజీర్ నిర్మాతల అభిప్రాయం. రామ్‌చరణ్ అందుకొన్న పారితోషికంపై ఫిల్మ్‌నగర్‌లో పెద్ద చర్చ జరుగుతుంది.

## జూనియర్ త్రిష



హీరో, హీరోయిన్లలకు డూపుల్లానే జూనియర్ల సంప్రదాయం గత కొన్నాళ్లుగా సాగుతోంది. బాగా పాపులర్ అయిన హీరో, హీరోయిన్ పోలికల్లో వుండేవారికి సైతం అవకాశాలు బాగానే లభిస్తుంటాయి. ఐశ్వర్యరాయ్ పోలికల్లో ఉండే స్నేహా ఉల్లాల్ దక్షిణాదిలో మంచి ఫామ్‌లో వుంది. ఇదే కోవలో 'ఈరోజుల్లో' చిత్రంలో రేష్మా వెండితెరకు పరిచయమయ్యింది. ఆమె దరిదాపులు చిత్రంలోని ప్రతి ఫ్రేమ్‌లోనూ త్రిషను తలపించింది. "ఈ రోజుల్లో" మల్టీప్లెక్స్‌లో మాత్రమే ప్రదర్శించే చిత్రం కావడం వల్ల రేష్మకు తగినంత ప్రచారం లభించలేదు.

## పాపం స్నేహ

తమిళ హీరో ప్రసన్నను స్నేహ గత కొన్నేళ్లుగా ప్రేమిస్తుంది. పెద్దలకు వీరు పెళ్లి చేసుకోవడం ఇష్టం లేకపోయినా ఒప్పించింది. మేలో ఈ వివాహం జరుగనుంది. ఈ పెళ్లిని భారీఎత్తున జరుపబోతున్నారు. సంపాదించిన డబ్బును స్నేహ పొలాలు, స్థలాల మీద పెట్టుబడి పెట్టింది. తమిళనాడులోని తన స్వగ్రామంలో కళ్యాణ మండపం కూడా కట్టించింది. పెళ్లి ఘనంగా చేసుకోవాలనుకోవడం, దానికి అవసరమైనంత డబ్బు లేకపోవడంతో ఇష్టపడి కట్టుకొన్న కళ్యాణ మండపాన్ని అమ్మేసింది. ఈ విషయమై ఆమెను ప్రశ్నిస్తే నాకిష్టమైన ప్రసన్న పెళ్లాడబోతున్నాను. ఈ విషయం ముందు కళ్యాణ మండపం అమ్మడం పెద్ద విషయం కాదంది.

# దమ్ము తగ్గింది!



✍ అల్లూరు రహీం

దర్శకుడు బోయపాటి శ్రీను 'సింహా' చిత్రం తర్వాత నందమూరి కథానాయకుడు ఎన్టీఆర్‌ను హీరోగా పెట్టి తీసిన చిత్రం దమ్ము. ఈ చిత్రానికి గతంలో చిరంజీవితో ఎన్నో చిత్రాలను క్రియేటివ్ కమర్షియల్ పతాకంపై తీసిన కె.ఎస్.రామారావు నిర్మాతగా వ్యవహరించారు. ఎన్టీఆర్ అభిమానులు ఈ చిత్రంపై ఎన్నో ఆశలు పెట్టుకొన్నారు. దర్శకుడు బోయపాటి శ్రీను నుంచి తొమ్మిది కథలు విన్నాక పదో కథగా దమ్ము చిత్రాన్ని అంగీకరించినట్లు హీరో చెప్పారు. ఎన్టీఆర్ గత సినిమాలకన్నా భిన్నమైన పాత్రను 'దమ్ము' కోసం సృష్టించానని దర్శకుడు గొప్పలకు పోయాడు. హీరో దమ్ము చాలదన్నకొన్నాడో ఏమో ఒకరికి ఇద్దరు గ్లామర్ హీరోయిన్లు త్రిష, కార్తీకలను ఈ సినిమాలో పెట్టాడు. అంతటితోనూ సంతృప్తి చెందక ముంబాయి నుంచి రచనామౌర్య, మరియం జకారియాలను తీసుకొచ్చి వాస్తు బాగుందనిపించే ప్రయత్నం చేశాడు.

యాక్షన్, భావోద్వేగాలను మస్తుగా దంచేశాడు. కానీ 'సింహాద్రి' చిత్రంలో కన్నా మెరుగైన నటన ఎన్టీఆర్ నుండి దర్శకుడు రాబట్టలేకపోయాడు. మాటి మాటికి వంశం గూర్చి గొప్పలు చెప్పుకొనే డైలాగులు కాస్త అతిగా తోస్తాయి. పదుల సంఖ్యలో మనుషుల తలలను సొరకాయల్లా కోయడం ఎంత దమ్మున్న మనిషికైనా సాధ్యమవుతుందా? అందుకే దమ్ము చిత్ర ఫలితంలో తేడా వచ్చింది. కీరవాణి సంగీతం సమకూర్చిన ఓ లిల్లి, దమ్ము, రాజువచ్చినాడో, వాస్తు బాగుందే పాటలు మాస్ మెచ్చేలా ఉన్నా తెరపై వాటి చిత్రీకరణ ఏమంత బాగా లేదు. ముఖ్యంగా దమ్ము, వాస్తు బాగుందే పాటలు దర్శకుడు మనసు పెట్టి ఉంటే ఇంకా బాగా చిత్రీకరించి ఉండవచ్చు. గ్రాఫిక్స్ వాడిన రూలర్ పాట ప్రేక్షకులను పెద్దగా ఆకట్టుకోలేదు. మాటలు వ్రాసిన నెల్లూరు రచయిత రత్నం ఓవర్ మాటలను దర్శకుడు తగ్గించే ప్రయత్నం చేయలేదు. సందర్భం లేకుండా ఎన్టీఆర్‌ను దారినపొయ్యే దానయ్య లాంటి పాత్ర నువ్వు రాజకీయాల్లోకి వస్తే పైకివస్తావ్ అంటుంది. దానికి బదులుగా రాత ఉంటే వస్తానంటాడు హీరో. మా బలం మాదే. పంది బలిస్తే ఏనుగు కాదు. దమ్ము రక్తంలో ఉండాలి వంటి డైలాగులు సినీ పరిశ్రమలో మరో హీరో కుటుంబానికి ఛాలెంజ్‌లు. అయితే జనం కోసం చంపు లేదా చావు. భయంతో వణికేవాడు చావుకు పనికిరాడు. గెలిచే మగాడు ఒక్కడే ఉంటాడు డైలాగులు బాగున్నాయి. బతకండి... బతకండి... అంటే వినలేదు కదరా... కోత మొదలయ్యింది... రాత వ్రాసిన బ్రహ్మ కూడా ఆపలేడనే లెంగ్తీ డైలాగులు చిత్రంలో చాలా చోట్ల ఉన్నాయి. ఈ డైలాగులతోనే చిత్ర నిడివి పెరిగింది. ప్రథమార్థంలో దమ్ము లేదనిపించే ఈ చిత్రం ద్వితీయార్థంలో గాడిన పడినట్లనిపించినా చివర మళ్లీ గాడి తప్పేస్తుంది. ఐదారు డజన్ల మంది నటీనటులున్న ఈ చిత్రం ఎన్టీఆర్, నాజర్, కోటశ్రీనివాసరావు, సంపత్, కిషోర్, శ్రీధర్‌రెడ్డిలను మినహా అలీ, బ్రహ్మానందం వంటి సీనియర్లను సరిగ్గా ఉపయోగించుకోలేకపోయాడు. ఒక చోట సోషలిజాన్ని గూండాయిజం, రౌడీయిజంతో సమానమని కలిపి చెప్పే ప్రయత్నం చేసి దర్శకుడు, కథారచయిత తమకున్న పరిజ్ఞానాన్ని లోకానికి చాటారు.




చిత్రకథలోనికి వెళ్తే వీరదుర్గం ప్రాంతంలో ఉండే రెండు జమీందారి కుటుంబాల పెద్దలు నాజర్, చరణ్‌రాజ్‌లకు పొడ గిట్టదు. నిత్యం ఈ ప్రాంతంలో సాగుతుండే నరమేధాన్ని ఆపను వాసిరెడ్డి వీరనాయుడు(సుమన్) తనవంతు ప్రయత్నం చేసి విఫలమౌతాడు. దీంతో నాజర్ మరింత రెచ్చిపోతాడు. ఈ దశలో హైదరాబాద్ నుంచి ఓ అనాథ యువకుడు విజయ(ఎన్టీఆర్)ను వీరనాయుడు కుమారుడని కోట శ్రీనివాసరావు వీరదుర్గానికి తీసుకువస్తాడు. సత్య(త్రిష) విజయ ప్రియురాలు. నీలవేణి(కార్తీక) విజయ మరదలు. సమాజానికి మంచి చేయకపోయినా పర్వాలేదు; చెడు చేయకూడదని విజయ భావించినా నాజర్, అతని కొడుకులు ఊరుకోరు. విజయ కుటుంబాన్ని అభిమానించే వారినంతా ఊచకోత కోస్తారు. చివర విజయ వాసిరెడ్డి కుటుంబ వారసుడు కాదని గ్రామస్తుల ముందు పెద్ద పంచాయితీ జరుగుతుండగా చనిపోయాడనుకొన్న వీరనాయుడు బయటకు వచ్చి తన మామ సహాయంతో విజయను ఊరికోసం అనాథగా పెంచానని వాస్తవం వెల్లడిస్తాడు. శత్రువు వెన్నులో వణుకు పుట్టించి అతని చేత కూడా దమ్మున్న నాయకుడని హీరో అనిపించుకోవడంతో చిత్రం ముగుస్తుంది.

# గెలుపే ప్రధానంగా పనిచేయాలి!

## తెలుగుదేశం శ్రేణులకు సోమిరెడ్డి ఉద్బోధ

త్వరలో జరుగనున్న నెల్లూరు పార్లమెంటు, ఉదయగిరి శాసన సభ నియోజకవర్గ ఉప ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీ అభ్యర్థుల విజయానికి సమిష్టిగా కృషి చేయాలని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి పార్టీ శ్రేణులకు పిలుపునిచ్చారు. ఏప్రిల్ 27తేది జిల్లా పార్టీ కార్యాలయంలో జరిగిన పార్టీ సర్వ సభ్య సమావేశంలో ఆయన మాట్లాడుతూ కోవూరు ఉప ఎన్నికలో స్వల్ప కాలంలోనే పార్టీకి ఓటింగ్ శాతాన్ని పెంచిన ఘనత పార్టీ కార్యకర్తలదేనన్నారు. ఇదే తరహాలో జరుగబోయే ఉప ఎన్నికలలోనూ గట్టిగా కృషి చేసి పార్లమెంటు బరిలో నిలుస్తున్న వంటేరు వేణుగోపాలరెడ్డి, ఉదయగిరి నుంచి పోటీ చేస్తున్న బొల్లినేని రామారావును గెలిపించాలని కోరారు. అవినీతి సొమ్ముతో వందలకోట్లకు పడగలెత్తిన జగన్ ముఖ్యమంత్రి కావాలని కలలు కంటున్నాడని, అది ఎన్నటికీ నెరవేరదన్నారు. జగన్ అక్రమాలపై ప్రజలకు వివరించి, జగన్‌కు తగిన గుణపాఠం చెప్పాలని పిలుపునిచ్చారు. ఎమ్పీ అభ్యర్థి వంటేరు వేణుగోపాలరెడ్డి మాట్లాడుతూ నెల్లూరు ఎమ్పీగా గెలిచిన మేకపాటి రాజమోహన్‌రెడ్డి నియోజకవర్గానికి ఒరగబెట్టిందేమీ లేదన్నారు. ఇక కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్న సుబ్బరామిరెడ్డి నెల్లూరు స్వస్థలం అని చెప్పుకొంటున్నా ఈ ప్రాంతానికి ఆయన చేసింది ఏమీ లేదన్నారు. ఉదయగిరి బరిలో వున్న బొల్లినేని రామారావు మాట్లాడుతూ ఈ ఎన్నికల్లో టిడిపి తప్పక గెలుస్తుందన్న ధీమా వ్యక్తం చేశారు. కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు, గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్‌లు మాట్లాడుతూ కోవూరు ఎన్నికలో జరిగిన ఓటమికి గల కారణాలను విశ్లేషించుకొని అవి పునరావృతం కాకుండా సరిదిద్దుకోవాలని సూచించారు. ఈ సమావేశంలో పలువురు పార్టీ ముఖ్య నేతలు పాల్గొన్నారు.




నెల్లూరు పార్లమెంటు, ఉదయగిరి అసెంబ్లీ స్థానాల నుంచి తెలుగుదేశం పార్టీ తరపున పోటీ చేస్తున్న వేణుగోపాల్‌రెడ్డి, రామారావులను పరిచయం చేస్తున్న సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి



జైన్‌గోల్డ్ మూడవ డ్రాలో విజేతలను ఎంపిక చేస్తున్న రత్నం విద్యాసంస్థల అకడమిక్ డైరక్టర్ డాక్టర్ కృష్ణకిషోర్. ప్రక్కన యన్.రామమూర్తినాయుడు, నరేంద్రజైన్.

## నమ్మకమైన నగలకు చిరునామా జైన్‌గోల్డ్

నెల్లూరు నగరంలో నమ్మకమైన బంగారు నగలకు నిఖార్సైన చిరునామా జైన్‌గోల్డ్ షోరూం అని రత్నం విద్యాసంస్థల అకడమిక్ డైరక్టర్ డాక్టర్ కె.కృష్ణకిషోర్ అన్నారు. 28వతేది సాయంత్రం జైన్‌గోల్డ్ షోరూంలో జరిగిన మూడవ లక్కీడ్రాకు ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఆయన మాట్లాడుతూ నాణ్యమైన, నమ్మకమైన నగలేగాకుండా ఖాతాదారులకు విలువైన కానుకలు అందజేయడం జైన్‌గోల్డ్‌కే చెల్లుబాటు అయ్యిందన్నారు. జైన్‌గోల్డ్ అధినేత మణిలాల్ జైన్ మాట్లాడుతూ తమ షోరూం గత 45ఏళ్లుగా నమ్మకమైన నగలను విక్రయించబట్టే జనాభిమానం పొందిందన్నారు. గత పదేళ్లుగా తమ జైన్‌గోల్డ్ షోరూం కోసం బిఐఎస్ హాల్‌మార్కు ఆభరణాలను సొంత డిజైనర్లతో తయారు చేయిస్తున్నామన్నారు. ఈ డ్రాలో రత్నం విద్యాసంస్థల జనరల్ మేనేజర్ ఎన్.రామ్మూర్తినాయుడు, జైన్‌గోల్డ్ నిర్వాహకులు నరేంద్రజైన్, రాజేష్‌జైన్ పాల్గొన్నారు.

## ఇంటర్ ప్రశ్నాపత్రాల గల్లంతు

### ✦ నిర్లక్ష్యానికి పరాకాష్ట!

నగరంలో సిఎఎం పరీక్షా కేంద్రంలో పరీక్ష వ్రాసిన ఇంటర్మీడియట్ ద్వితీయ సంవత్సరం విద్యార్థుల ఫిజిక్స్–2 పేపర్ గల్లంతు కావడం కలకలం రేపింది. మార్చిలో జరిగిన ఇంటర్మీడియట్ పరీక్షల్లో ఈ కేంద్రంలో 387 మంది విద్యార్థులు పరీక్ష వ్రాశారు. ద్వితీయ సంవత్సరం విద్యార్థుల ఫలితాలు ప్రకటించినప్పటికీ ఈ 387 మంది ఫలితాలు ప్రకటించలేదు. దీనిపై విద్యార్థులు, తల్లిదండ్రులు అధికారులను ప్రశ్నించడంతో అప్పుడు కలతెలుసుకొన్న వీరు హైదరాబాద్‌లోని ఉన్నతాధికారులను సంప్రదించడంతో సమాధాన పత్రాలు గల్లంతైన వ్యవహారం వెలుగు చూసింది. ఇందులో అడుగడునా అధికారుల నిర్లక్ష్యం కన్పిస్తోంది. మార్చి 14న ఫిజిక్ –2 పేపర్ వ్రాసిన విద్యార్థుల సమాధాన పత్రాలు మూల్యాంకనం కోసం పోస్టల్‌శాఖ ద్వారా విజయనగరం పంపించారు. ఇదంతా ఎంపిక చేసిన డిస్పాచ్‌కమిటీ ఆధ్వర్యంలో జరుగుతుంది. ఆ తర్వాత రాష్ట్రవ్యాప్తంగా అన్ని జిల్లాలకు సంబంధించిన విద్యార్థుల సమాధాన పత్రాలు దిద్దిన అధికారులకు నెల్లూరు సిఎఎం స్కూలు సెంటర్‌లో విద్యార్థుల ఆన్సర్‌షీట్లు ఆ కేంద్రానికి చేరలేదని తెలియకపోవడం వారి నిర్లక్ష్యాన్ని తెలియజెపుతుంది. కనీసం ఫలితాలు ప్రకటించేముందైనా తెలుసుకోలేనంత కుంభకర్ణ నిద్రలో వున్నారు అధికారులు. ఫలితాలలో తమ నెంబర్లు కన్పించకపోవడంతో ప్రశ్నించిన విద్యార్థులకు చావుకబురు చల్లగా చెప్పడంతో ఎంతో ఆశతో ఎంసెట్ ఇతర పోటీ పరీక్షలకు హాజరవుతున్న విద్యార్థులు దిక్కుతోచని స్థితిలో పడిపోయారు.

## శ్రీశ్రీ మహాకవి

శ్రీశ్రీ వంటి కవి ప్రపంచంలో ఎక్కడా కానరాడని సాహిత్య విమర్శకుడు చలసాని ప్రసాద్ చెప్పారు. 30వ తేది టౌన్‌హాలులో సీనియర్ న్యాయవాది వేములపాటి అనంతరామయ్య శ్రీశ్రీ ప్రగతి ట్రస్టు ఆధ్వర్యంలో జరిపిన మహాకవి 102 జయంతి సభలో ముఖ్యవక్తగా విచ్చేసి మాట్లాడారు. విప్లవం నా కన్న తల్లి, ఆకలే విప్లవానికి ప్రేరణ అనడంతోపాటు ఇప్పుడు నడుస్తున్న చరిత్రను ఎప్పుడో అక్షరబద్ధం చేసిన అరుదైన కవిగా వర్ణించారు. ప్రొఫెసర్ వకుళాభరణం రామకృష్ణ మాట్లాడుతూ శ్రీశ్రీని సాహిత్యంలో పలుచన చేసేందుకు కొందరు పనికిమాలిన పసలేని వాదనలు చేస్తుంటారని అవి దేనికీ కొరగానివన్నారు. సభకు డాక్టర్ కాళిదాసు పురుషోత్తం స్వాగతం, ఈతకోట సుబ్బారావు వందన సమర్పణ చేశారు.

## ముదనష్టంగానే వున్నాయి

16వ పేజీ కొరవ

వినికిడి. అయితే ఆయన మనసులోని మాట అంత సులభంగా బయటపడదు. కారణం ఏదైతేనేమి, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో తీవ్రస్థాయి ముఠా కుమ్ములాటలు మొదలైపోయాయి. కాంగ్రెస్ కంటే అధ్వాన్నంగా తయారౌతున్నది పరిస్థితి. ఈ ఎన్నికలలో దీని ప్రభావం పెద్దగా వుండకపోవచ్చు కానీ భవిష్యత్తులో చాలా ఇబ్బందులు ఎదురు కావడం ఖాయం. ఇప్పటికిప్పుడు మాత్రం, జగన్ పార్టీలో ఎన్నికల పట్ల ఎవరికీ ఉత్సాహం లేని పరిస్థితి నెలకొన్నదన్నది నిజం.

అయితే దీన్ని తమకు అనుకూలంగా వాడుకొనే పరిస్థితిలో అటు కాంగ్రెస్ ఇటు తెలుగుదేశం పార్టీలు రెండూ లేకపోవడం ఆ పార్టీల దీనస్థితిని వ్యక్తం చేస్తున్నది. నెల్లూరు నగరం, రూరల్ నియోజకవర్గాలలో తన మనుషులందరూ వలస పోతున్నా ఆనం వివేకానందరెడ్డికి చీమ కుట్టినట్లు కూడా లేదు. ఎవరినీ ఆపే ప్రయత్నం చేయడం లేదు; కొత్తగా ఎవరినీ చేర్చుకొనే ఆలోచన అసలు లేదు. చాలా నిరాసక్తంగా వ్యవహరిస్తున్నాడాయన. కావలిలో కూడా అదే పరిస్థితి. నాథుడన్న వాడు లేని అనాథగా మారి పోతున్నది కావలి నియోజక వర్గంలో కాంగ్రెస్ పార్టీ.

తెలుగుదేశం సంగతి ఎంత తక్కువగా చెప్పుకొంటే అంత మేలు. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, టి.రమేష్‌రెడ్డిల మధ్య సయోధ్య లేకపోవడంతో నెల్లూరు రెండు నియోజకవర్గాలలో పార్టీ నామ మాత్రావశిష్టమై పోయింది. ఎవరినీ ఎదగనివ్వలేదు; ఎవరినీ దగ్గర తీయడం లేదు. కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి వంటి కొద్దో గొప్పో సామర్థ్యం వున్న వారిని కూడా వెనుక బెంచ్‌లో కూర్చోబెట్టి పెద్ద తప్పు చేసింది తెలుగుదేశం పార్టీ. దాని వల్లనే ఈ ఎన్నికలలో నెల్లూరు నగర, నెల్లూరు రూరల్, ఆత్మకూరు శాసనసభ నియోజకవర్గాలలో తెలుగుదేశం పార్టీ దాదాపుగా శూన్యమనే చెప్పాలి. అంత విస్తారమైన ప్రాంతంలో పార్టీ ఉనికి లేకుండా లోక్‌సభలో పోటీ పడడం ఏమిటి? ఆ లోపాన్ని సరిదిద్దుకొనే ప్రయత్నం ఇప్పటికీ జరగకపోవడం ఇంకా బాధాకరం. టిడిపి లోక్‌సభ అభ్యర్థి వంటేరు వేణుగోపాలరెడ్డి, కోమాలో వున్న పార్టీతో ఏగడం ఎట్లనో అర్థం కాక వెలవెల పోతున్నాడు, పాపం!

కాంగ్రెస్ అభ్యర్థి తిక్కవరపు సుబ్బరామరెడ్డి రాజకీయ శైలి కూడా నెల్లూరీయులకు మ్రింగుడు పడడం లేదు. అర్థం కూడా కావడం లేదు. ఆయన బంధువులు, స్నేహితులు, అనుచరులు ఎక్కడెక్కడి నుంచి నియోజకవర్గంలో దిగిపోయి వున్నారు. స్థానికులతో సంబంధం లేకుండా నేరుగా కాంగ్రెస్ వాదుల ఇళ్లకు వెళ్లి సంప్రదింపులు జరుపుతున్నారు. నియోజకవర్గాలను తమ సామ్రాజ్యాలుగా భావించే ఆనం వివేకానంద రెడ్డి వంటి నేతల స్వభావం గుర్తించకుండా నడుస్తున్న పోకడ ఇది. మాజీ మేయర్ పులిమి శైలజారెడ్డి విషయంలో ఇదే జరిగింది. అయితే ఇదొక వివాదం కాకముందే గౌరవం కాపాడుకోవడం మేలనుకొన్న ఆమె, సుబ్బరామరెడ్డి గారు నెల్లూరుకు రాకముందే హడావుడిగా మేకపాటికి ఇంటికి వెళ్లి జగన్ కండువా భుజాన కప్పుకొన్నారు. స్థానిక పరిస్థితులు, స్థానిక అవసరాలు అవగాహన చేసుకోకుండా ఎన్నిక నిర్వహించడం ఎంత ప్రమాదకరమో సుబ్బరామరెడ్డి బంధువులు గ్రహించడం అవసరం.

ఆయనే స్పర్ధలకు మూలకేంద్రమవడం విశేషమే.

## రాజీనామాలు గీకేస్తున్నారు!

కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీ కార్యాలయాలకు ప్రస్తుతం రాజీనామా లేఖలు ఎక్కువయ్యాయి. ఈ వారంలోనే నగర కాంగ్రెస్ పార్టీలో చెప్పుకోతగ్గ స్థాయి ఉన్న సంక్రాంతి కళ్యాణ్, వికాస్ స్కూల్ అధినేత ప్రతాప్, సన్నపురెడ్డి వెంకట సుబ్బారెడ్డిలు రాజీనామాలు చేసి వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తీర్థం పుచ్చుకొన్నారు. తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి 'నీడ' అని అందరూ చెప్పుకొనే కోడూరు కమలాకర్‌రెడ్డి కూడా ఆ పార్టీకి రాజీనామా గీకేశారు. రాజీనామా సమయంలో ఇన్నాళ్లు పోషించిన పార్టీలను, వాటికి నేతృత్వం వహించే నాయకులను తూర్పారబట్టడం కొసమెరుపు.

## ఉచిత సంధ్యా వందన శిక్షణ

ఆంధ్రప్రదేశ్ బ్రాహ్మణ సేవా సంఘ సమాఖ్య నేతృత్వంలో ఉచిత బ్రాహ్మణ సంధ్యా వందన శిక్షణ శిబిరం 28వ తేది ఆదిశంకర జయంతిని పురస్కరించుకొని ప్రారంభమయ్యింది. నెలరోజులపాటు ఈ శిబిరం జరుగుతుంది. ప్రతిరోజు సాయంత్రం ఐదు గంటల నుంచి ఏడు గంటల వరకు మూలపేటలోని మూలస్థానేశ్వర స్వామి దేవస్థాన ప్రాంగణంలో ఈ శిబిరం జరుగుతుంది. ఈ అవకాశాన్ని బ్రాహ్మణ సోదరులను వినియోగించుకోమంటున్నారు సమాఖ్య అధ్యక్షులు వెల్లంబేటి చంద్రమౌళి.

## వీళ్లనెందుకు ఓదార్చడు?

రాజకీయాల్లో 'లాపాయింట్లు' లాగి మరి మాట్లాడడంలో జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఘనాపాటి. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధినేత జగన్మోహన్‌రెడ్డిని విమర్శిస్తూ చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడే మాటలు ఎప్పుడూ చర్చనీయాంశమే. రాష్ట్ర ప్రజల గ్రహచారం బాగోలేక ఒకవేళ జగన్మోహన్‌రెడ్డి అధికారంలోకి వస్తే ఆయన క్యాబినెట్‌లో మంగలి కృష్ణకు హోమ్, భానుకిరణ్‌కు సినిమాటోగ్రఫీ, గాలి జనార్ధనరెడ్డికి గనులశాఖ, అంబటి రాంబాబుకు మహిళా శిశు సంక్షేమశాఖ, విజయసాయిరెడ్డికి ఆర్థిక శాఖలను కేటాయిస్తారని చమత్కరించారు. రాష్ట్రమంతా ఓదార్పు యాత్ర చేస్తున్న జగన్మోహన్‌రెడ్డి బళ్లారి – కృష్ణపట్నం మధ్య ఇనుప ఖనిజం రవాణా చేసిన లారీల క్రిందపడి ప్రాణాలు కోల్పోయిన 250 మంది కుటుంబాలను ఎందుకు ఓదార్చరో సమాధానం చెప్పాలని నొక్కివక్కాణించారు.

## అక్కడచూసి ఇక్కడ ఓటు!

విశాఖపట్నం పార్లమెంట్ సభ్యునిగా తాను ఆ నగరాభివృద్ధికి చేసిన కృషిని చూసి నెల్లూరు ప్రజలు తనకు ఓటు వేస్తారని ఇక్కడి పార్లమెంటు స్థానం నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్న తిక్కవరపు సుబ్బరామరెడ్డి ప్రకటించారు. పుట్టిన ఊరు నెల్లూరులో పోటీ చేయడం ఆనందంగా వుంది. ఇక్కడ నేను గెలుస్తానన్న ఆత్మవిశ్వాసం వుంది. గెలిచిన తర్వాత నెల్లూరు – విశాఖపట్నంలను జంట నియోజకవర్గాల మాదిరి అభివృద్ధి చేస్తానంటున్నారు. సుబ్బరామరెడ్డి మాటలపై ఆయన ఇంకా ప్రచారం మొదలుపెట్టకపోయినా నెల్లూరీయులు విశ్వాసం ఉంచడం గొప్ప విషయంగానే చెప్పాలి.

## సంచలనాల నారాయణ

నాటు కోడి నారాయణగా సుప్రసిద్ధుడైన సిపిఐ రాష్ట్ర కార్యదర్శి నారాయణ వారంలో రెండు రోజులపాటు నెల్లూరులో బస చేశారు. మొదటి రోజు ఆటోలో వేదాయపాళెంకు పెళ్లికి వచ్చి వార్తల్లో నిలచిన ఈ కామ్రేడ్ రెండోరోజు పిఎస్ఎల్వీ రాకెట్ ప్రయోగానికి ముందు ఇస్రో శాస్త్రవేత్తలు దేవాలయాలకు వెళ్లడాన్ని తప్పుపట్టారు. శాస్త్ర పరిజ్ఞానాన్ని పెంపొందించాల్సిన శాస్త్రవేత్తలు దేముళ్లను పూజించడమేమిటి? పరిజ్ఞానమంటే కొత్త పోకడలను సృష్టించడమేగాని మూఢనమ్మకాలను పెంచడం కాదని విశ్లేషించారాయన. దీనికి శాస్త్రవేత్తల సమాధానం ఏమిటో?

## సిటీ ఎమ్మెల్యేకు మాతృ వియోగం

నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్ కృష్ణారెడ్డి తల్లి భూదేవమ్మ(85) 27వ తేది మరణించారు. గత కొంత కాలంగా అస్వస్థులై చికిత్స పొందుతూ ప్రాణాలొదిలారు. ఆమె చివరి కోరిక ప్రకారం రెండు నేత్రాలను మాదరన్ ఐ హాస్పిటల్ వైద్యులు చిరంజీవి చారిటబుల్ ట్రస్ట్‌కు అందించారు. భూదేవమ్మకు ఇద్దరు కుమారులు, ఓ కుమార్తె. ఆమె చిన్న కుమారుడే శ్రీధర్‌కృష్ణారెడ్డి.

మాతృమూర్తిని కోల్పోయిన వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతిని తెలియజేస్తున్నాము.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

వాసూరావును కళాంజలి సాంస్కృతిక సంస్థ 29వ తేదీ ఘనంగా సన్మానించింది. టౌన్‌హాలులో రాజేశ్వరరావు పేరిట నిర్వహించిన సంగీత విభావరిలో పలువురు చిన్నారులు పాల్గొని ఆ పాత మధుర గీతాలను పాడి విన్పించారు. ఈ సందర్భంగా వాసూరావు మాట్లాడుతూ సింహపురి గడ్డపై సన్మానం అందుకోవడం చాలా సంతోషంగా ఉందన్నారు. ఈ కార్యక్రమంలో కళాంజలి నిర్వాహకుడు అనంత్, డాక్టర్ అజయ్‌కుమార్, బి.వి.నరసింహం, హజరత్ బాబు, విజయకుమార్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## వ్యాక్సిన్ వికటించింది

గూడూరు సీమాంక్ సెంటర్‌లో పసికందుకు వేసిన వ్యాక్సిన్ వికటించింది. చాగణానికి చెందిన పెంచలమ్మ ఈ కేంద్రంలో మగబిడ్డను ప్రసవించింది. అక్కడి వైద్య సిబ్బంది ఆ పసిగుడ్డుకు వ్యాక్సిన్ వేయగా కొద్దిసేపటికి మరణించడంతో కుటుంబ సభ్యులు ఆందోళనకు దిగారు. వైద్యుల నిర్లక్ష్యం కారణంగానే తమ బిడ్డ చనిపోయిందన్నారు. దీనిపై పోలీసులకు ఫిర్యాదు చేసినట్లు సమాచారం.

## జొన్నవాడ కామాక్షమ్మ బ్రహ్మోత్సవాలు

జొన్నవాడ కామాక్షమ్మ బ్రహ్మోత్సవాలు మే 11 నుంచి 21 వరకు జరుగుతాయని ఆలయ కార్యనిర్వహణాధికారి వేగూరు రవీంద్రరెడ్డి తెలిపారు. 11వ తేదీన అంకురార్పణతో మొదలయ్యే ఈ ఉత్సవాల్లో 12వ తేది ధ్వజారోహణ, 13వ తేది శేషవాహనం, 14న పురుషా మృగం, 15వ తేది సింహ వాహనం, 16వ తేది హంసవాహనం, 17న రావణసేవ, 18 వెండి నందిసేవ, 19న రథోత్సవం, 20వ తేది కళ్యాణం, తెప్పోత్సవం, 21వ తేది అశ్వవాహనం, ఏకాంత సేవలతో బ్రహ్మోత్సవాలు ముగుస్తాయన్నారు. వీటిలో 17 నుంచి 20వరకు జరిగే ఉత్సవాలు ముఖ్యమైనవన్నారు. ప్రతిరోజు సాయంత్రం సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాట్లు చేసినట్లు తెలిపారు. భక్తులు ఈ ఉత్సవాల్లో అధిక సంఖ్యలో పాల్గొని కామాక్షమ్మ కృపను పొందాలని కోరుతున్నారు.

## అనిల్ భగభగ

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నెల్లూరు నగర ఇన్‌ఛార్జ్ పోలుబోయిన అనిల్‌కుమార్ యాదవ్‌ను పార్టీలకు అతీతంగా అందరూ అభిమానిస్తారు. మృదుస్వభావి అని, రాజకీయాల్లోకి వచ్చి చేతి చమురు బాగా వదలించుకొన్న నిఖార్సైన వ్యక్తన్న ఇమేజ్ ఆయనకు వుంది. ఇప్పటికే పార్టీ కోసం బాగా ఖర్చుపెట్టిన అనిల్‌కు తెలియకుండా నగరంలో కొందరు వలస నేతలను మాజీ ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి నేరుగా తన ఇల్లు వేదికగా పార్టీలో చేర్చుకోవడం మింగుడు పడడం లేదాయనకు. ఈ విషయమై గత కొన్నాళ్లుగా గమ్మునుండిన అనిల్ ఇటీవల అంతర్గతంగా భగభగ మండుతున్నట్లు పార్టీ వర్గాల్లో చర్చ జరుగుతోంది. రాజమోహన్‌రెడ్డి వయస్సులో పెద్ద మనిషి. పార్టీలో వచ్చే చిన్న చిన్న వ్యవహారాలను సర్దవలసిందిపోయి

## జనవాణి

2వ పేజీ కొరవ

పోయింది. నెల్లూరు పార్లమెంట్, 18 అసెంబ్లీ స్థానాల్లో జరిగే ఎన్నికల్లో రాష్ట్రంలో పార్టీ చేయాల్సిన కాయకల్ప చికిత్సను తగిన సమయంలో చేయనందుకు తగిన ఫలితాలే రేపు వస్తాయి.

పి.సునీల్ కావలి

### సినిమాల్లో బూతుమాటలు

ఇటీవల విడుదలవుతున్న సినిమాల్లో పచ్చి బూతుపదాలను యదేచ్ఛగా పలికేస్తున్నారు. దీని వల్ల కుటుంబ సభ్యులతో సినిమాలకు వెళ్లిన వారు వీటిని భరించలేక సిగ్గుతో తలదించుకోవాల్సి వస్తుంది. తెలుగు భాషకు, సినిమాకు కళంకం తెచ్చే ఇటువంటి సన్నివేశాలను సెన్సార్ ఎలా అనుమతిస్తుందో అర్థం కావడం లేదు. హైదరాబాద్ ప్రాంతీయ సెన్సార్‌బోర్డు అధికారిగా మహిళ పనిచేస్తున్నా సినిమాల్లో బూతుమాటలు రావడం బాధాకరం.

డి.సుధాకర్ నెల్లూరు

### దొంగతనాలను అరికట్టలేమా?

పేరు గొప్ప ఊరు దిబ్బలా నెల్లూరు నగరం పరిస్థితి తయారయ్యింది. పగలు రాత్రి అన్న తేడా లేకుండా ఇళ్లలో దొంగతనాలు, ఆదమరిస్తే బ్యాంకుల దగ్గర డబ్బుల దోపిడీ, చివరకు దేవాలయాల్లో హుండీలను కొల్లగొట్టేస్తున్నారు. రోడ్లప్రక్కన పార్కింగ్ చేసిన కార్లు, స్కూటర్లు పట్టుకెళ్లిపోతున్నారు. ఇరుగు పొరుగుతో బాగుంటే ఇళ్ల దొంగతనాలు అరికట్టవచ్చు. పోలీసులు ఈ వ్యవహారంలో కేసు కట్టడం మినహా దొంగలను పట్టుకోవడంలో చొరవ చూపడం లేదు. ఇదెంతో బాధాకరం.

సిహెచ్. సురేష్‌బాబు నెల్లూరు

## పదరంగం -13

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | | 3 | | | 4 | 5 | | 6 |
| 7 | | | | 8 | | | 9 | | | |
| | | 10 | 11 | | | | 12 | | 13 | |
| 14 | 15 | | | | 16 | 17 | | | 18 | |
| | 19 | | | 20 | | | | 21 | | |
| 22 | | | | | 23 | | 24 | | | |
| | | 25 | | | | | 26 | | 27 | 28 |
| | | | | 29 | | | | 30 | | |
| | | 31 | 32 | | | 33 | | | 34 | |
| | 35 | | 36 | 37 | | | | 38 | | |
| 39 | | | 40 | | | | 41 | | | |

**అడ్డం**

1. గౌతమబుద్ధుని జన్మదినం (5)
4. బుద్ధుని అర్ధాంగి (4)
7. అటు నుంచి బండరాయి (2)
8. నెపం, కారణం (2)
9. సంహారం (2)
10. ఖర్చులు పోగా (3)
12. నినాదాలు చేయు (4)
14. నాణాల తయారీ కేంద్రం (4)
16. నిలువు 11లోగల నేత్రవ్యాధి మరలా వచ్చింది (3)
18. డ్రాప్, నక్షత్రం (2)
19. పరిచారిక (4)
21. రాజుల నివాసాలు (3)
22. అర్థించేవాడు (2)
24. పూల సువాసన (2)
25. అలసట (4)
26. మెజీషియన్ (2)
29. వృక్షము (2)
30. అద్దె తడబడింది (3)
31. ప్రస్తుతం జరుగుతున్న కాలం అటు నుంచి (2)
33. మీనం అటునుంచే (2)
34. విష్ణుపూజారి (2)
36. బుద్ధునికి జ్ఞానోదయం ఈ వృక్షం క్రిందే జరిగింది (4)
39. కొంచెం మాయను పిలవండి (2)
40. దైత్యుల తల్లి (2)
41. ధనుష్ పాట (4)

**నిలువు**

1. వాంఛతీర్చుకోవాలనే ఉత్సాహం (4)
2. శిలపై కూర్చున్న సిద్ధయ్య (1,8 అక్షరాలు) (2)
3. చీకటి, అంధకారం (3)
4. తెర (4)
5. శోధించడం (3)
6. రుధిరపు బొట్లు (5)
10. వేలి ముద్ర (3)
11. కంటి వ్యాధి (3)
13. అన్‌లోడ్ చెయ్యడం (3)
15. జటధారి శివుడు (3)
17. లక్ష్మికి వికృతి (2)
20. రాకుమారి స్నేహితురాలు తిరగబడింది (4)
21. నిష్ణాతుడు (4)
22. భూమి నుంచి పుట్టిన సీత(4)
23. ఆడుమానం (3)
24. ఫ్రెష్ (2)
25. బలం కలిగి ఉండడం తడబడింది (3)
27. ఆకాశం (3)
28. వారు బావి వద్దనే బిచానా పరిచారు 2,3,8 అక్షరాలు (3)
32. కళ్లులేనివాడు (3)
33. పదిహేను రోజులు (2)
35. పుణ్య తీర్థాల ప్రయాణం క్రింద నుంచి (2)
37. పంచాంగంలో ఒకటి క్రింద నుంచి (2)
38. శిరస్సు (2)

**సమాధానాలు**

## పదరంగం -12

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 భు | 2 వి | | 3 క | ల | 4 క | లం | | 5 వ | ని | 6 త |
| 7 వ | ల | లు | డు | | ర | | కం | 8 సుం | | రు |
| 9 న | యం | | గు | | 10 ము | 11 ర | | ధ | | వు |
| వి | | 12 నా | 13 నీ | లు | | 14 వి | 15 త | ర | ణ | |
| జ | | 16 గు | రు | వు | | | ను | | | 17 క్యూ |
| యం | | ల | | 18 ము | ము | 19 క్షు | వు | | | |
| | 20 క్రీ | చ | కు | 21 డు | | ద్ర | | | 22 ప్ర | ణం |
| | | వి | | | | 23 పూ | జా | 24 రి | | హ |
| 25 స | ద్గ | తి | 26 కో | 27 సం | | జ | | కా | | రో |
| న్ని | | | 28 మా | ఘం | | లు | | మి | | జా |
| ధి | న్ని | 29 పె | | | 30 ఐ | | 31 త్రి | | 32 మ | 33 ధ్వ |

# సంక్షిప్త సింహపురి

## ప్రపంచ పుస్తక దినోత్సవం



నెల్లూరు టౌన్ హాలులో సృజన సాహిత్య సాంస్కృతిక వేదిక ప్రపంచ పుస్తక దినోత్సవాన్ని ఇటీవల జరిపింది. ఈ సందర్భంగా కవి సమ్మేళనం, తమకు నచ్చిన పుస్తకంలో ముఖ్యాంశాలను కవులు అభివర్ణించారు. సభకు అధ్యక్షత వహించిన కుట్టి విద్యాసంస్థల అధినేత లతీఫ్‌కుట్టి మాట్లాడుతూ పుస్తక పఠనంతోనే సామాన్యులు మేధావులయ్యారన్నారు. ఈ సందర్భంగా నెల్లూరీయుడైన ప్రముఖ నవలా రచయిత కోలపల్లి ఈశ్వర్‌ను దగ్గుపాటి రాధాకృష్ణ సత్కరించారు. వినుకొండ వెంకటేశ్వర్లు, పోలా సుబ్బారావు, నేలనూతల ప్రశాంతి, బి.వి.నరసింహం, సర్వేపల్లి రామమూర్తి, గంధవల్లి కోటేశ్వరరావు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## పోస్టల్ శాఖ నిర్వాకం

ఒకప్పుడు నమ్మకానికి మారుపేరు పోస్టల్ శాఖ. ఇప్పుడు బద్ధకానికి, పనిచేయనితనానికి తిరుగులేని చిరునామా ఆ శాఖ. పోస్టల్ శాఖ నిర్వాకం మూలంగా 387 మంది సీనియర్ ఇంటర్ విద్యార్థుల జీవితాలు వీధిలో పడ్డాయి. నెల్లూరు సిఎంఎం స్కూల్ సెంటర్‌గా ఈ యేడాది మార్చిలో ఫిజిక్స్–2 పరీక్ష వ్రాసిన 387 మంది విద్యార్థుల ప్రశ్నాపత్రాలు వాటిని దిద్దాల్సిన సెంటర్ విజయనగరంకు ఇంకా చేరలేదు. రిజల్ట్స్ ప్రకటించాకగానీ ఈ విషయం ఎవరూ తెలుసుకోలేక పోయారు. విద్యార్థుల తల్లితండ్రులు వెళ్లి ఇంటర్ పరీక్షల ఆర్‌ఐఓ వరప్రసాద్‌ను నిలదీస్తే ఆయన మళ్లీ పరీక్ష వ్రాసుకోవచ్చని ఇచ్చిన ఉచిత సలహా ఎంత నిర్లక్ష్యమైనదో వర్ణించలేం. పార్శిల్ మాయంచేసిన పోస్టల్ శాఖను, దాన్ని పట్టించుకోని ఇంటర్ బోర్డు అధికారులను చీపుర్లతో సత్కారం చేయను నెల్లూరీయులకు సంస్కారం అడ్డువచ్చి ఉంటుంది. ఈ సత్కారానికి అర్హులు వీళ్లు!

## అనర్హత వేటు వేయండి!



కొంత మంది రాజకీయ నాయకులు ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసే రీతిలో ప్రజలు ఇచ్చిన తీర్పుకు కట్టుబడి ఉండాల్సింది పోయి సొంత ప్రయోజనాల కోసం తమ ఇష్టం వచ్చినపుడు రాజీనామాలు చేయడం, తిరిగి వారే ఎన్నికల్లో పోటీచేయడం దురదృష్టకరమంటున్నారు ప్రజా సంక్షేమ సంఘం అధ్యక్షుడు మహమ్మద్ రవూఫ్. ప్రజాతీర్పు పాటించకుండా, ఐదేళ్లు పూర్తి పదవీ కాలంలో కొనసాగకుండా స్వప్రయోజనాల కోసం రాజీనామాలు చేసే ఎవరైనా మళ్లీ ఎన్నికల్లో పోటీ చేయకుండా అనర్హత వేటువేసి గట్టిగా బుద్ధి చెప్పాలని ఈమేరకు రాజ్యాంగ సవరణకు పూనుకోవాలని డిఆర్వోకు ఇచ్చిన వినతిపత్రంలో కోరారు. స్వార్థ రాజకీయం వికటాట్టహాసం చేస్తున్న ఈ రోజుల్లో ఇది సాధ్యమయ్యే కోరికేనా?

# మానవత మమతల కలబోత "అనురాగస్పర్శ"!

*"కళ కళకోసం కాదు ప్రజల కోసం"* – శ్రీశ్రీ

కథగాని, కవితగాని, నాటకంగాని, నాట్యంగాని, వాయిద్యంగాని, గానంగాని ప్రజాభ్యుదయం, జగతి, ప్రగతి కొరకు సాగాలిగాని ప్రపంచ తిరోగమనానికి, పెట్టుబడిదారుల కొమ్ముకాయడానికి కాకూడదు. ప్రజా కవులు, రచయితలు, రచయిత్రులు వేమన, గురజాడ, వీరేశలింగం పంతులు, శ్రీశ్రీ, నెహ్రూ, శివసాగర్, కొడవగంటి కుటుంబరావు, బోయి భీమన్న, ఆరుద్ర, దాశరథి, ముప్పాళ్ల రంగనాయకమ్మ, ఓల్గా మొదలగు వారు కాగా పాశ్చాత్య రచయితలలో సోక్రటీసు, కారల్ మార్క్స్, మాక్సిం గోర్కి, పి.బి షెల్లీ, బెట్రాండ్ రస్సెల్ మొదలగు మహానుభావులు సమాజాన్ని తమ రచనల ద్వారా ప్రభావితం జేసినవారే!

మల్లెపూవు మనసు, ముక్కుసూటితనం, నిజాయితీ, నిర్భయాలకు నిలువెత్తు రూపం మరియు సహజకవి యం.యస్.రెడ్డి గారి అనంగు సోదరుడు డాక్టర్ మల్లెమాల వేణుగోపాలరెడ్డి గారి కలం నుండి జాలువారిన మానవత మమతల కలబోత సంవేదనే ఈ "అనురాగస్పర్శ" కథాసంపుటి.

రెడ్డిగారు, ఆయన అనుభవాలకు, పరిశీలనలకు మానవీయత మమతానురాగాలను జోడించి సూటిగా, స్పష్టంగా, నెల్లూరు, కడప ప్రాంతాల మాండలికాలతో, సామెతలతో మమతానురాగాలను, మానవీయతను, హాస్యాన్ని వైవిధ్య భరితంగా మనకు "అనురాగ స్పర్శ" కల్గిస్తాడు.

మీరే అవలోకించండి

సార్! నా కథరాయరూ! కథలో "నా కొడుకు ఇంజనీరై వాడు ఒక ఇంటి వాడైతే, మా అమ్మ కడతేరే దాకా నేను ఒళ్లు దాచుకోకుండా కష్టపడతాను... ఆ తర్వాత ఏముంది నేను కసుమూరు దర్గాలో కసుఊడ్చుకొంటూ సేవ చేసుకొంటాను". – కథానాయిక మస్తానీ స్వభావాన్ని, వేదాంతాన్ని చిన్న మాటలలో మనకు బోధిస్తాడు.

అలాగే "దహన... సంస్కారం" కథలో సావిత్రమ్మ గారు పెద్దింటి దేవతలాంటి ఇల్లాలు 'దేవత' సినిమాలో సావిత్రిలాగ. వెంకటేసు ఆమె సర్వెంటు. సావిత్రమ్మ చనిపోతుంది. ఆమె కాష్టం తనే కాల్చాలనే ఆలోచన రాగానే హార్టు అటాక్ వచ్చి చచ్చిపోతాడు. చిన్నక్క వెంకటేసు భార్య. చిన్నక్క మనసులో ఇలా గొణుగుతుంది. సావిత్రమ్మగోరు పిలుసుకెళ్లినట్టున్నారు" ఇలా కులాలకు, అంతస్తులకు అతీతంగా మానవీయ విలువలకు పట్టాభిషేకం చేస్తాడు.

**పుస్తకసమీక్ష**

**మల్లెమాల కథలు - 4**
**"అనురాగ స్పర్శ"**

*రచయిత* :**డాక్టర్ మల్లెమాల వేణుగోపాలరెడ్డి**
సమీక్షకుడు:**రాచపాళెం రఘు**
వెల: రూ.75/– పుటలు: 121
*ప్రతులకు:* విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ, దిశ పుస్తకకేంద్రం, 'చినుకు' పబ్లికేషన్స్.
ఫోన్ : 08562 – 244546

"జీవన దుందుభి" కథలో "స్నేహమేరా జీవితం... స్నేహమేరా శాశ్వతం" అన్న సినీ కవి పాటలా కథను మనకు దృశ్య కావ్యం చేస్తాడు.

"అనురాగ స్పర్శ" కథలో దాస్ దంపతులు వయస్సు మళ్లిన వారు. పైగా దాస్ హార్టు పేషెంట్, దాస్ భార్య పక్షవాతరోగి. అయినా శాంతమ్మ వారికి తన ఇంట్లో పని కల్పించి ఆదుకొంటుంది. దాస్ దంపతులు కూడా తల్లిదండ్రులను మించిన వాత్సల్యం శాంతమ్మపై కురిపిస్తారు. ఇలా ఒకరి కొరకు మమతానురాగాలు పంచుకొంటూ జీవన మాధుర్యాన్ని గ్రోలేలా కథను నడుపుతాడు.

"కంచికి చేరని కథ" లో అభ్యుదయ రచయితల నిజరూపాల్ని వారి మనోవైకల్యాన్ని విశ్లేషణాత్మకంగా వివరిస్తాడు.

"ముగురమ్మలు" కథలో మహాలక్ష్మి, శారదమ్మ, పార్వతమ్మల విశిష్ట వ్యక్తిత్వాలతో కథ నడుస్తుంది. కథ చివరిలో మూడు నెలల వ్యవధిలో ముగ్గురూ చనిపోతారు. ఆ సందర్భంగా రచయిత మాటలు "ఆ ముగ్గురమ్మలూ నా ఊపిరిలో దివ్యజ్ఞానాన్ని నింపి, మానవత్వానికి మార్గదర్శకత్వం నెరపిన నా ఆరాధ్య దేవతలు, నా జీవితానికి దీపధారులు అంటూ స్త్రీజన పక్షపాతిగా నిలుస్తాడు.

ఇలా అన్ని కథలలో ఆహ్లాదకరమైన కథనాకౌశలం, ఆరోగ్యకరమైన హాస్యధోరణి, ఓ హెన్రీ కథలలోని ఎత్తుగడ, గురజాడ వారి మానవీయత, కొడవగంటి కుటుంబరావు వాస్తవికత కలబోసి స్థానికత, సౌందర్యాత్మకత, తాత్వికత వాస్తవికత(థ)లతో పాఠకుల హృదయాలను రంజింపజేస్తాడు.

ఆయన కథలు పులుగడిగిన ముత్యాల్లా ఎల్లప్పుడూ ప్రకాశిస్తూనే ఉంటాయి. ఇంత మంచి కథా రచయిత నెల్లూరీయుడైనందున తగిన గుర్తింపు రాలేదేమోననాల్సి వస్తుంది.

### కాంగ్రెస్ కొంప ఖాళీ... కోమాలో తెలుగుదేశం... వైఎస్ఆర్ కాంగ్రెస్‌లో ముఠా కుమ్ములాటలు...

# మూడు పార్టీలూ ముదనష్టంగానే వున్నాయి!

నెల్లూరు లోక్‌సభ నియోజకవర్గం ఎన్నిక రోజురోజుకూ రంజుగా మారుతున్నది. ఈస్టమన్ కలర్ సినిమా కంటే మిన్నగా కనువిందు చేస్తున్నది. చూసిన వారికి చూసినంత వినోదం. కాంగ్రెస్ అభ్యర్థిగా తిక్కవరపు సుబ్బరామరెడ్డి వెలుగులోకి రావడం వల్లనే ఈ పరిస్థితి. ఆయన పేరు వినగానే జగన్ బృందమంతా ఉలిక్కి పడింది. వారి అభ్యర్థి మేకపాటి రాజమోహన్‌రెడ్డి మరింత ఆందోళనకు గురౌతున్నాడు. సుబ్బరామరెడ్డి ఏ పని చేసినా తుఫాన్ వేగంతో వుంటుంది కాబట్టే ఈ అలజడి. ఆయనొస్తే, వెంటనే గుంపుడు సినిమా తారలుంటారు. ఆ వెనుకే స్వామీజీలు, బిషప్‌లు, బుకారీలు వస్తారు. వూరంతా తిరునాళ్ల సందడి. ఆయన పరిచయాలు ఒక్క కాంగ్రెస్‌కు పరిమితం కాదు. అన్ని పార్టీలనూ కలక వేస్తాడు. అన్నిటిలో వున్న వారినీ మొగమాటపెడతాడు. బ్రతిమలాడుతాడు, బుజ్జగిస్తాడు. మేకపాటి రాజమోహన్‌రెడ్డికి అంతకు క్రితం వరకు తన గెలుపు మీద చాలా నమ్మకం వుంది. డబ్బు ఖర్చు విషయంలో కొణిజేటి రోశయ్యకు దగ్గరి బంధువాయన. జేబులో నుంచి పైసా తీయాలంటే ప్రాణం మీదకు వస్తుంది. అందువల్లనే కాంగ్రెస్, టిడిపిలలో అభ్యర్థులుగా వుంటారనుకొన్న వారికి ఫోన్ చేసి, ఈ ఎన్నికలలో మనమొక ఒప్పందానికి వద్దామా అని ఆహ్వానించాడు. నేను ప్రచారంలో మందు సీసాలు, పోలింగ్ రోజు ఓటుకు నోటు ఇవ్వను; మీరు కూడా ఇవ్వవద్దు, ఒక ఆదర్శవంతమైన ఎన్నిక జరపదాం అని ప్రతిపాదించాడు. ఆ చర్చలట్లా కొనసాగుతుండగానే సుబ్బరామరెడ్డి ముందుకు వచ్చాడు. ఆయన్ను ఢీ కొనాలంటే, జేబులు కాదు, పడమటింట్లో దాచి పెట్టిన పెట్టెలు కూడా ఖాళీ అయిపోతాయి. మేకపాటికి నిజమైన బాధ, ఆందోళన ప్రధానంగా అదే అని చెప్పడం అతిశయోక్తి కాదు. నోట్లు వెదజల్లితే ఓట్లు రాలవు. కానీ ఎన్నికల ప్రచారంలో డబ్బు ప్రభావం బాగా అధికం. అందులో లోపం వస్తే ప్రజాభిప్రాయంలో మార్పు వస్తుంది. ఆ ప్రమాదం రాకుండా కాపాడుకోవాలంటే పోటీ పడి ద్రవ్యాన్ని ద్రవం వలె పారించక తప్పదు.

తాను గందరగోళానికి గురి కావడమే కాదు, తనతోపాటు మొత్తం వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీనే గందరగోళ పరుస్తున్నాడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి. కడపలో వైఎస్ జగన్‌కు వచ్చినంత మెజార్టీ సాధించి, చరిత్ర సృష్టించాలన్నది ఆయన సంకల్పం. సుబ్బరామరెడ్డి అభ్యర్థిత్వం వల్ల ఏర్పడిన పరిస్థితులు అందుకు అడ్డంకి కాకూడదనే ఉద్దేశంతో, ఎప్పుడూ లేని రీతిలో ఎన్నిక నిర్వహిస్తున్నాడాయన. తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీలలో వుండే చిన్నా చితకా నాయకులందరికీ ఫోన్లు చేస్తున్నాడు. ఎవరు ముందుకు వస్తే వారందరికీ కండువా కప్పి పార్టీలో కలిపేసుకొంటున్నాడు. సుబ్బరామరెడ్డి ప్రచారం మొదలు పెట్టే నాటికి కాంగ్రెస్ పార్టీని ఖాళీ చేయాలన్నది ఆయన ఉద్దేశంగా కనపడుతున్నది. నెల్లూరు నగరంలో ఈ ప్రయోగం అనుకొన్నదానికంటే అధికంగా ఫలితాలనిస్తున్నది. ఇంతకాలం ఆనం వివేకానందరెడ్డి అండతో జనం మీద పడి దోపిడీలు, దుర్మార్గాలు చేసిన వారంతా, ఇక జన్మలో నెల్లూరులో కాంగ్రెస్ గెలుపు సాధ్యం కాదన్న నిజాన్ని గ్రహించి, మేకపాటి ఇంటికి మందలు మందలుగా వచ్చి పడుతున్నారు. అటు వివేకా వ్యతిరేకులదీ అదే వరస. కాంగ్రెస్‌లో ఆనం వారిని కాదని బ్రతకడం కష్టమనే భావనతో వ్యతిరేకులూ మేకపాటి ఆశ్రయం పొందుతున్నారు. దాదాపు ప్రతి రోజూ ఆయన ఇంట్లో ఈ వలసల ఉత్సవాలు జరుగుతున్నాయి. కావలి, కోవూరు నియోజకవర్గాలలో కూడా ఇదే సూత్రాన్ని పాటిస్తున్నాడు మేకపాటి రాజమోహన్ రెడ్డి.

ఈ పరిణామం ఆ పార్టీ నేతలను కలవర పరుస్తున్నది. తమకు మాట మాత్రం చెప్పకుండా తమ ప్రాంతాలలో తమకు వ్యతిరేకులైన వారిని పార్టీలో చేర్చుకోవడం పట్ల, నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్, రామిరెడ్డి ప్రతాప్‌రెడ్డి వంటి వారంతా మథనపడుతున్నారు. పార్టీ జిల్లా అధ్యక్షుడు కాకాణి గోవర్ధన్‌రెడ్డి కూడా కొంత అసంతృప్తితో వున్నట్లు

కొరవ 14వ పేజీలో



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com